# ఆంధ్రప్రదేశ్

1971
మార్చి

50 పైసలు



# ఆంధ్రప్రదేశ్ గురించి

* ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 8 శాతానికి, ఆంధ్ర ప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికిసమానం.

* ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 275109 చ.కి.మీటర్లు.

* 1961 లో సేకరించిన లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా, 3,59,83,447 మంది.

* 1961లెక్కల ప్రకారం, అక్షరాస్యుల శాతాన్నిబట్టి, ఆంధ్రప్రదేశ్ భారతదేశ రాష్ట్రాలలో పదవ స్థానం ఆక్రమించింది.

* 1961 లెక్కల ప్రకారం, జనాభాలో అక్షరాస్యులు 21.2 శాతం మంది వున్నారు. కాగా భారతదేశం మొత్తంమీద వున్న అక్షరాస్యుల శాతం 24.0.

* 1961 లో హైదరాబాదు, కృష్ణా, పశ్చిమగోదావరి, గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాలలో అక్షరాస్యులు, అఖిల భారత స్థాయికంటే ఎక్కువ మంది వున్నారు.

* రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ. 281లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ.306లు మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333లు చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటున ఆదాయం రూ. 430 లకు పెరుగుతుంది.

* రాష్ట్రంలో 1000 అడుగుల లోతు మేరలో సుమారు 1.000 మిలియన్ టన్నులబొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2000 అడుగుల లోతు మేరలో 1 320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.

* భారత దేశంలో, బారైట్స్ వుత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ దే అగ్రస్థానం. దేశంలో వుత్పత్తి అయ్యే బారైట్స్ లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో వుత్పత్తి అవుతున్నది.

* అభ్రకం వుత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాతి స్థానం ఆంధ్రప్రదేశ్ ది.

# ఆంధ్రప్రదేశ్

మార్చి, 1971

ఫాల్గుణం - చైత్రం 1892_93 శా. శ

సంపుటి: 15 సంచిక: 5

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు

ఏప్రిల్ సంచిక

ఉగాది ప్రత్యేక సంచికగా

వెలువడుతుంది



మొదటి అట్ట: ఉగాది శోభ

మూడో అట్ట: శ్రీశైల దేవాలయం

చివరి అట్ట: విశాఖపట్టణం: సముద్రతీరంలో సూర్యోదయం



**వెల : 50 పైసలు**

**సాలు చందా: 6 రూపాయలు**

రిజిస్టర్డ్ నెం. 133






[ఈ సంచికలో రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పని సరిగా ప్రభుత్వానికి సంబంధించినవిగా భావించనక్కరలేదు]

# పారిశ్రామిక విప్లవ పథంలో.....

దక్షిణ భారత ధాన్యాగారమని ప్రసిద్ధిచెందిన, ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ యిప్పుడిప్పుడే నెమ్మదిగా స్థిర సంకల్పంతో పారిశ్రామిక యుగంలో ప్రవేశిస్తున్నది. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారి దూరదృష్టి, ఆచరణ సాధ్యమైన ఆలోచనల వల్లనే యిది సాధ్యమైంది. రాష్ట్రంలోని వ్యవసాయ, ఖనిజ సంపదవనరులను బాగా వినియోగించుకుని రాష్ట్ర అభివృద్ధిని సాధించే ఉద్దేశంతో భారత దేశమంతటి నుండీ, విదేశాల నుండీ కూడా పారిశ్రామికవేత్తలను ఆకర్షించే విధంగా ఆయన కృషి చేస్తున్నారు.

ఈ సంవత్సర ప్రారంభంలో, మనకు గర్వకారణమై, రాష్ట్ర ప్రతిష్ఠను యినుమడింపజేసే రు. 500 కోట్ల ఉక్కు-ఫ్యాక్టరీకి ప్రధానమంత్రి విశాఖపట్టణంలో ప్రారంభోత్సవం జరపడం మన రాష్ట్ర పారిశ్రామిక ప్రగతి చరిత్రలో ప్రధానమైన ఘట్టం. ముఖ్యమంత్రి సంకల్పించిన "రోజుకో పరిశ్రమ" అనే విధానం ప్రజల్లో బాగా ప్రచారంలోకి వచ్చినప్పటికీ ఆయన అంతటితో సంతృప్తి పడలేదు. సగటున "రోజుకు రెండు పరిశ్రమలు" అనే విధానాన్ని ఆయన యిప్పుడు చేపట్టారు. వెనుకబడివున్న మన రాష్ట్ర ఆర్థికవ్యవస్థను స్థిరమైన పారిశ్రామిక పునాదుల సహాయంతో త్వరితగతిలో పురోగమింపచేయడానికి ఆయన శ్రద్ధగా కృషి చేస్తున్నారనడానికి యిదే నిదర్శనం. అనేక పరిశ్రమలు స్థాపించబడడం, చాలా వాటిలో పని ప్రారంభం కావడం జరిగింది. భారతదేశపు నడిబొడ్డులోవుంటూ, దేశపు ఐక్యతకూ, స్థిరత్వానికీ దోహదం చేస్తూ చరిత్రను సృష్టించిన మన రాష్ట్రంలో యీ నాడు జరుగుతున్న బ్రహ్మాండమైన మార్పుకు యీ కొత్త పరిశ్రమలు దర్పణాల వంటివి.

ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లోని రాజకీయ పరిస్థితులు స్థిరత్వానికీ, భవిష్యత్తులో ప్రగాఢ విశ్వాసంతో కృషి చేయడానికీ దోహదకారులుగా వున్నాయి. గత రెండేండ్ల కాలంలో యింత అనుకూల పరిస్థితి ఏనాడూ కలుగలేదు. ద్వేష, హింసాపూరితమైన వాతావరణం రాష్ట్ర ప్రజల అభ్యున్నతికి ఎటువంటి నష్టం కలిగించగలదో యీనాడు అందరికీ అర్థమైంది. తాత్కాలికోద్రేకాలతో నిండిన వాతావరణం ఎంతటి స్థిరచిత్తుణ్ణి అయినా కొంతవరకు కదిలించగలుగుతుంది. అయినప్పటికీ నిష్పక్షపాతంగా చూచినట్లయితే ప్రజల మనస్సులూ, హృదయాలూ మాత్రం నిర్మలంగా, నిశ్చలంగానే వున్నాయనేది నిర్వివాదం.

శరవేగంతో పురోగమిస్తున్న ఆధునిక ప్రపంచంలో భావావేశాలకు ఏ మాత్రం తావులేదు. వేర్పాటు ధోరణులు ఎక్కడైనా, ఆర్థిక పరిస్థితులనూ, వెనుకబడినతనాన్నీ పురస్కరించుకుని తల యెత్తుతుంటాయి. అనేక పరిశ్రమలు కొత్తగా ప్రారంభించబడి, ఉద్యోగావకాశాలు అధికమైనకొలది పరిస్థితి మారుతుంది. దీని ప్రభావం తెలంగాణా ప్రాంతంమీద యిప్పటికే కనిపిస్తున్నది. తెలంగాణా జీవనాడి అని చెప్పదగిన పోచంపాడు ప్రాజెక్టూ, రామగుండంలోని బొగ్గు ప్రాతిపదికగాగల ఎరువుల ఫ్యాక్టరీ, యింకా యితర అనేక అభివృద్ధి కార్యక్రమాల ఫలితంగా తెలంగాణా ప్రాంత స్వరూపం పూర్తిగా మారిపోతున్నది. ప్రధానమంత్రి ప్రతిపాదించిన అష్టసూత్ర ప్రణాళిక అమలు జరిగిన ఫలితాలు అప్పుడే కనిపిస్తున్నవి. పారిశ్రామికరంగంలో, లోగడ కేంద్ర పెట్టుబడులు చాలా స్వల్పంగా వుండేవి. గత కొలది సంవత్సరాల కాలంలో యీ పెట్టుబడులు బాగా పెరిగాయి; ఫలితంగా పబ్లిక్ రంగంలోనూ, ప్రైవేటు రంగంలోనూ భారీయెత్తున పరిశ్రమలు వెలిశాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని మూడు భారీ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు, అంటే నాగార్జునసాగర్, శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టుల పనికి స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ ప్రారంభోత్సవం చేయగా, ఆయన పేరు నిలబెట్టే కూతురు అని చెప్పదగిన శ్రీమతి ఇందిరాగాంధీ విశాఖపట్టణం ఉక్కు ఫ్యాక్టరీ పనికి ప్రారంభోత్సవం చేయడం హర్షించదగిన సంఘటన. ఈ ఫ్యాక్టరీని రాష్ట్ర పారిశ్రామిక ప్రగతిలో నూతన శకానికి నాందిగా పేర్కొనవచ్చు. అంటే, స్వర్గీయ నెహ్రూ మన రాష్ట్రంలో వ్యవసాయ విప్లవానికి బీజాలు నాటితే, శ్రీమతి ఇందిరాగాంధీ పారిశ్రామిక విప్లవానికి పునాదులు వేశారని చెప్పవచ్చు.

—పి. వి. ఆర్

# జాతీయ సమైక్యతా శక్తులను బలపరచండి

## -గవర్నరు ఉద్బోధ



ప్రపంచంలో భారత్ తన మహత్తర పాత్ర నిర్వహించడానికి తగిన శక్తిని సమకూర్చడానికిగాను ఐక్యత, సమైక్యతా శక్తులను శక్తిమంతం చేయడానికి దీక్షా కంకణం ధరించాలని, రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా యిచ్చిన సందేశంలో రాష్ట్ర గవర్నర్ శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఉద్బోధించారు.

జాతీయ సమైక్యతా సాధనకు ఆంధ్రప్రదేశ్ విశిష్టమైన తోడ్పాటు యివ్వవలసివున్నదని, ఆయన అన్నారు. మహదానందకరమైన రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ఆయన రాష్ట్ర ప్రజలకు హృదయపూర్వక శుభాకాంక్షలు తెలిపారు.

1950 జనవరి 26న అమలులోనికివచ్చిన భారత రాజ్యాంగం ప్రతిపౌరునికి నేరుగా అధికార వ్యవస్థ ప్రాతిపదికకు చేరే అవకాశమిచ్చే ప్రభుత్వాన్ని దేశానికి సమకూర్చిందని గవర్నర్ పేర్కొన్నారు. అందువల్ల రాజకీయాధికార హక్కు అంటే వోటు చేసే హక్కు లేదా ప్రతినిధులను ఎన్నుకునే హక్కు మాత్రమేగాక అధికారాన్ని పొందే హక్కు, అధికారంలో వుండడానికి ఎన్నుకొనబడే హక్కు కూడా అవుతున్నదని ఆయన చెప్పారు. పార్లమెంటరీ వ్యవస్థ, వయోజనులందరికీ వోటింగ్ హక్కు కారణంగా ప్రభుత్వం ప్రజలకు, వారి ప్రతినిధులకు జవాబుదారీ వహించవలసి వుంటున్నది.

భారతీయుల సహనశీలాన్ని విజ్ఞతను ప్రతిబింబించే మతాతీత స్వరూపం రాజ్యాంగంలోని అత్యంత ప్రశంసనీయమైన అంశం. మతం, కులం, జాతి, లేదా లింగభేదాలతో నిమిత్తం లేకుండా అందరికీ ఒకేరకమైన పౌరసత్వాన్ని రాజ్యాంగం సమకూరుస్తున్నది. ప్రతి పౌరునికి తనకు యిష్టం వచ్చిన మతాన్ని అనుసరించే స్వేచ్ఛ వున్నది.

మహత్తరమైన ఈ దేశ సమైక్యతను నిరాఘాటంగా పెంపొందించడానికి రాజ్యాంగ నిర్మాతలు ఆ విధంగా పునాది వేశారని గవర్నర్ తెలిపారు.

పంచవర్ష ప్రణాళికల ద్వారా వ్యవసాయోత్పత్తి, నీటిపారుదల మొదలైన రంగాలలో చెప్పుకోదగ్గ పురోగతిని దేశం సాధించిందని ఆయన చెప్పారు. పరిశ్రమల అభివృద్ధికి పరపతి లభింపజేసే లక్ష్యంతో జరిగిన బ్యాంకుల జాతీయీకరణ, మన ఆర్థిక వ్యవస్థలో సామ్యవాద లక్ష్య సాధన మార్గంలో ఒక మైలురాయి వంటిదని ఆయన తెలిపారు.

నాలుగవ ప్రణాళిక మన ఆర్థిక వ్యవస్థలో ఒక ముఖ్యమైన దశకు ప్రాతినిధ్యం వహిస్తున్నదని గవర్నర్ అన్నారు. దేశంలోని వెనుకబడిన ప్రాంతాలకు వివిధ మార్గాలలో దీనివల్ల సహాయం జరుగుతుందని, ఆంధ్రప్రదేశ్‌తో సహా పెక్కు రాష్ట్రాలలోని వెనుకబడిన ప్రాంతాలను సాధ్యమైనంత త్వరలో అభివృద్ధి చేయడము ఈ ప్రణాళిక లక్ష్యమని ఆయన వివరించారు.

గత ఏడాది మనం సాధించిన విజయాలను సూచనగా తీసుకుంటే అవి ఈ ఏడాది యితోధిక విజయాలు సాధ్యమన్న ఆశాభావాన్ని కలుగజేస్తున్నవని అన్నారు. పారిశ్రామికంగా రాష్ట్రం పురోగమిస్తున్నదని చెబుతూ 71 కోట్ల రూపాయల ఖర్చుతో రామగుండంలో బొగ్గు ప్రాతిపదికగా నెలకొనే ఎరువుల ప్రాజెక్టు పనికి ప్రారంభోత్సవం జరగడం, పోచంపాడు ప్రాజెక్టునుంచి నీరు వదలడంతో తెలంగాణా ఆర్థిక స్వరూపం తప్పక మారిపోతుందని ఆయన అన్నారు. ధవళేశ్వరం వద్ద గోదావరి బరాజు నిర్మాణం, వంశధార ప్రాజెక్టు నిర్మాణం రాష్ట్రాభివృద్ధికి ఉద్దేశించబడినవని ఆయన చెప్పారు.

వీటన్నిటికీ మించి విశాఖపట్నం వద్ద ఉక్కు ఫ్యాక్టరీకి మన ప్రియతమ ప్రధాని శంకుస్థాపన చేయడం రాష్ట్ర పారిశ్రామికీకరణలో పెద్ద ముందంజ అని గవర్నర్ అన్నారు.

భావి నాయకులైన యువతరంపై భారతదేశ స్వేచ్ఛా, గౌరవాలను కాపాడే భారం వున్నదని శ్రీ నెహ్రూ ఒకనాడు చెప్పిన మాటలను ఉదహరిస్తూ ఆయన తమ ప్రసంగం ముగించారు.





# నగరంలో కనుల పండువగా

# రిపబ్లిక్ దినోత్సవ విన్యాసాలు

జనవరి 26వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా సికింద్రాబాదులో పెరేడ్ మైదానంలో వందనం స్వీకరించారు.





# విశాఖ ఉక్కు కర్మాగారం రాష్ట్ర ఆర్థిక ప్రగతికి రాచబాట

కాసు బ్రహ్మానందరెడ్డి



భారత ప్రధానమంత్రి జనవరి 20 తేదీన విశాఖపట్టణం ఉక్కు ప్రాజెక్టుపనికి ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయిన తరువాత ఇది సాలీనా 20 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి చేస్తుంది.

1953 లో ప్రప్రథమంగా ప్రత్యేక రాష్ట్రం అవతరించిన తరువాత-అంటే తెలుగు ప్రజలకు ఒక ప్రత్యేక రాష్ట్రం అవతరించిన తరువాత తెలుగు ప్రజలకు ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఏర్పడిన తర్వాత ఈ కొత్త ఉక్కు ఫ్యాక్టరీ వాస్తవిక రూపం ధరించడం ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకు చిరస్మరణీయమైన సార్థకమైన సంఘటన. ఆర్థిక ప్రగతి విషయంలో మనకుగల ఉన్నతాశయ సిద్ధికి మాత్రమే ఇది చిహ్నంకాదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి నాంది సూచకంకూడా. ఎందుకంటే వ్యవసాయమే ప్రాతిపదికగాగల మన ఆర్థికవ్యవస్థకు, ఇంతవరకు లేనట్టివిస్తృతావకాశాలు యిప్పుడు యీ ప్రాజెక్టువల్ల కలుగుతాయి.

"ఈ శుభ సందర్భంలో మొట్టమొదట మన ప్రధాన మంత్రికి కృతజ్ఞతలు చెప్పవలసివుంది. ఎందుకంటే పారిశ్రామికంగా తక్కువ అభివృద్ధి చెందిన ప్రాంతాల అవసరాలను ఆశయాలను దూరదృష్టితో ఆమె గమనించిన ఫలితంగానే ఆంధ్రప్రదేశ్‌లో భారీ ఉక్కు కర్మాగారం ఏర్పాటు గావడం సాధ్యమైనది. ఈ శుభసమయం మనకు ఎంతో ఆనందదాయకమైనది. ముఖ్యంగా ప్రధాన మంత్రి యీ ఉక్కు ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం జరుపడం మనకు మరీ సంతోషదాయకమైన విషయం.



సహజ సంపద విషయంలో ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన రాష్ట్రం కాదు. భారత దేశంలో సహజ సంపద సమృద్ధిగాగల ప్రాంతాలలో ఇదిఒకటని గట్టిగా చెప్పవచ్చు. అత్యధిక ప్రజానీక శ్రేయస్సుకై ఈ సహజ సంపదను గరిష్ట పరిమితిలో వినియోగించడమే రాష్ట్రప్రభుత్వం అనుసరిస్తున్న విధానం ఈ దృక్పథంతోనే రాష్ట్ర ప్రభుత్వం నిరంతరం కృషి చేస్తున్నది కూడా. గత మూడు ప్రణాళికల క్రింద ఆర్థిక సాంఘిక వ్యవస్థలో ఆంధ్రప్రదేశ్ అన్ని రంగాలలో గణనీయమైన ప్రగతి సాధించింది. వ్యవసాయ రంగంలో రాష్ట్రానికి వున్న ప్రాముఖ్యత అందరూ గుర్తించిన విషయమే. ఆహారధాన్యాల కొరత ఏర్పడిన సందర్భాలలో మన రాష్ట్రం ఇతర రాష్ట్రాలకు ధాన్యాగారంవలె ఉపకరించింది. దేశం

మొత్తంమీద ఉత్పత్తి అయ్యే ఆహార ధాన్యాలలో ప్రస్తుతం 7.6 శాతం మన రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది. నూనె గింజల విషయంలో 13.8 శాతం, చక్కెర విషయంలో 10.1 శాతం మన రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నాయి. అంతే కాకుండా, నీటి పారుదల వసరులు ఇతర రాష్ట్రాలకంటే మన రాష్ట్రంలోనే ఎక్కువగా వున్నాయని చెప్పవచ్చు. నీటిపారుదల ప్రాజెక్టుల సంఖ్య విషయంలో కూడా మన రాష్ట్రమే మిన్న. మనరాష్ట్రంలో నీటిపారుదల క్రింద 98 లక్షల ఎకరాల భూమి సాగు అవుతున్నది. చతుర్థ ప్రణాళిక అంతం నాటికి మన రాష్ట్రంలో మొత్తం 103.7 లక్షల ఎకరాలు సాగు అవుతున్నాయి.

## విద్యుచ్ఛక్తి

థర్మల్, జల విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు ఆంధ్రప్రదేశ్‌లోవున్న సహజ వనరులు ఇంక ఏ ప్రాంతంలోకూడా వుండవని చెప్పవచ్చు. జలవిద్యుదుత్పాదన 3000 కి. వా. వుండగలదు. ప్రణాళికలలో ఇతర రంగాలలో కూడా విద్యుచ్ఛక్తి కొరకు చాలా ఎక్కువగా పెట్టుబడి పెట్టడం జరిగింది. ప్రస్తుతం 610 కి. వా. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతున్నది. ఈ శక్తి చతుర్థ ప్రణాళిక అంతం నాటికి 980 మె.వా. కు పెరుగుతుంది. 1979 నాటికి ఇది 2250 మె.వా. కు పెరుగుతుంది. గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమం, ఆరంభంలో మందకొడిగా వున్నప్పటికీ, ఇప్పుడు జాతీయ సగటు ప్రగతిని అధిగమించింది. వ్యవసాయ పంపింగు సెట్టులకు 1956-57 లో 4930 సర్వీసు కనెక్షనులు మాత్రమే వుండగా ఇది 1969-70 లో 1,57,699 కి పెరిగింది.

వ్యవసాయం, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల విషయాల పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించినప్పటికీ విద్యారంగం విషయంలో కూడా తగిన శ్రద్ధ చూపడం జరిగింది. ఉచిత ప్రాథమిక విద్యావ్యాప్తికి ఆంధ్రప్రదేశ్ చేసిన అవిరళకృషి చెప్పుకోదగిన ఘన విజయాలలో ఒకటి. 1956-57లో ఉండిన 29076 ప్రాథమిక పాఠశాలల సంఖ్య 1968-69లో 36 766 కు పెరిగింది. ఆ కాలంలో విద్యార్థుల సంఖ్య కూడా 24.81 లక్షలనుంచి 30.80 లక్షల వరకు పెరిగింది.

## సముద్రతీరం: సహజసంపద

ఆంధ్రప్రదేశ్‌కు ప్రకృతి ప్రసాదించిన సహజ సంపదలలో పేర్కొనదగినది. రెండు చిన్న రేవులు, ఒక పెద్ద రేవుగల 600 మైళ్ళ పొడవుగల సముద్రతీరం, ఇనుము, మాంగనీసు, మైకా, బ్యారైట్సు, సున్నపురాయి, క్వార్ట్సు, అస్బెస్టాస్, బొగ్గు వంటి ఇతర ఖనిజములు. పారిశ్రామిక పెట్టుబడికి ఈ ఖనిజ సంపద లాభసాటి యైన అవకాశాలు కల్పిస్తుంది. ఐతే పెట్టుబడి రేటు ఆశించిన దానికంటే చాల తక్కువగా వుంది. ఆర్థిక రంగంలో పారిశ్రామిక విభాగం కూడా ఇతర రంగాలలో అభివృద్ధినే సూచిస్తున్నది.

వ్యవసాయమే ప్రధాన పాత్ర వహించిన కారణంగా పరిశ్రమల రంగంలో ఆంధప్రదేశ్ కొంతవరకు ఆలస్యంగా ప్రవేశించింది. ఐతే పరిశ్రమలు నెలకొల్పే విషయంలో యిటీవల కొంత ముందడుగు వేయడం జరిగింది. 1955-61 మధ్యకాలంలో దేశం మొత్తంమీద పరిశ్రమల విస్తరణకు అంకురార్పణ జరిగింది. దీని ప్రభావం దేశం మొత్తంమీద పడింది. ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా ఈ కాలంలో అనేక పరిశ్రమల అభివృద్ధి జరిగింది. చక్కెర, వనస్పతి, బట్టల మిల్లులు, జనుము పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. సిమెంట్, పింగాణీ రసాయనికములు, రసాయనిక ఎరువులు, మెషిన్‌టూల్స్ వంటి కొత్త పరిశ్రమలు అవతరించాయి. ఫెర్రో మేంగనీసు స్టీల్ ఫోర్జింగులు ఉక్కు మూసలు, స్పన్ పైపులు మున్నగు అనేక రకములైన ఇంజనీరింగు వస్తువుల ఉత్పత్తికి కూడా పరిశ్రమలు ఏర్పడినాయి. చక్కెర ఉత్పత్తి శక్తిని హెచ్చించడానికి తగిన చర్యలు తీసుకొన్న ఫలితంగా, డిస్టిలరీ, ఆల్కహాల్ ప్రాతిపదికగల పరిశ్రమలు నెలకొల్పడం సాధ్యపడింది. ప్రయివేటు రంగంలో పెటుబడి మొదటి ప్రణాళికలో రూ. 21 కోట్లు, రెండవ ప్రణాళికలో రూ. 75 కోట్లు, మూడవ ప్రణాళికలో రూ. 55 కోట్లు వుండవని అంచనాలను బట్టి తెలుస్తున్నది.

అయితే ద్వితీయ ప్రణాళిక కాలంలో పరిశ్రమల రంగంలో సాధించిన గణనీయమైన ప్రగతి ఏమంటే అనేక చిన్న పరిశ్రమలు నెలకొల్పబడినాయి. లఘు పరిశ్రమల రంగానికి రాష్ట్ర ప్రభుత్వం అనేక సౌకర్యాలు కల్పించి ఉదారంగా ఆర్థిక సహాయం కూడా చేసింది. రాష్ట్రంలో సుమారు రూ. 4 కోట్ల పెట్టుబడితో 600 లఘు పరిశ్రమలు వెలసినాయి. తృతీయ ప్రణాళికలో కూడా ఈ విధంగా పరిశ్రమలు అవతరించాయి. సుమారు రు. 6 కోట్లు పెట్టుబడితో దాదాపు 1,000 పరిశ్రమలు నెలకొల్ప బడినాయి. తృతీయ ప్రణాళిక అంతమైన తరువాత నాలేండ్ల కాలంలో రూ. 10 కోట్ల పెట్టుబడితో ఇంచుమించు 3000 లఘు పరిశ్రమలు ఏర్పాటు అయినాయి. ఇదే కాలంలోనే ఈ రంగంలో మరొక రూ. 100 కోట్లు పెటుబడి పెట్టడం జరిగింది

## ప్రభుత్వం ఏం చేసింది ?

పరిశ్రమలు, వ్యవసాయం మధ్య సమన్వయమైన ప్రగతి సాధించేందుకు రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను తగు రీతిగా తీర్చి దిద్దవలసిన అవసరాన్ని రాష్ట్ర ప్రభుత్వం గుర్తించింది. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో అసమానత్వాన్ని తగ్గించి, పారిశ్రామిక ప్రగతిని తీవ్రతరం చేయడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తీసుకొన్న కొన్ని చర్యలు దిగువ పేర్కొన బడినాయి.

(అ) ఋణములు గ్రాంట్ల రూపంలో ఆర్థిక సహాయం చేయడం.

(ఆ) పెద్ద పరిశ్రమల కొరకు పారిశ్రామిక వాటికలు. పారిశ్రామిక అభివృద్ధి ప్రాంతాలు ఏర్పాటు చేయడం.

(ఇ) కీలక ఉత్పత్తి యూనిట్లతో పాటు, సర్వీసు, శిక్షణ పథకాలు అమలు పరచడం.

(ఈ) పారిశ్రామిక ప్రగతిని ప్రోత్సహించడానికి ఏజన్సీలుగా ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ, ఆంధ్రప్రదేశ్ మైనింగు కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల అభివృద్ధి సంస్థలను ఏర్పాటు చేయడం.

## పారిశ్రామిక అభివృద్ధి సంస్థ

పరిశ్రమల ఏర్పాటును పరిశ్రమల పెట్టుబడిని ప్రోత్సహించడానికి ప్రత్యేక ఏజన్సీగా 1961 లో పారిశ్రామిక అభివృద్ధి సంస్థను రాష్ట్రప్రభుత్వం ఏర్పాటుచేసింది. భారత దేశంలో ప్రప్రథమంగా మనరాష్ట్రంలోనే ఇటువంటి సంస్థ ఏర్పాటు చేయడం జరిగింది. ఆ తరువాతనే ఇతర రాష్ట్రాలు కూడా ఈ పద్ధతిని అనుసరించాయి ఇప్పుడు దాదాపు అన్ని రాష్ట్రాలలో ఇట్టి సంస్థలు ఏర్పడినాయి

రాష్ట్ర లో లభించే అపారమై ఉత్పత్తి వనరులకు సరితూగే విధంగా సాంఘిక, ఆర్థిక రంగాలన్నిటిలో ప్రభుత్వమూ, ప్రజలూ ఉన్నత స్థాయిలో కృషి చేశారనే విషయం పంచవర్ష ప్రణాళికల క్రింద ఆంధ్రప్రదేశ్ ఆర్థిక రంగంలో జరిగిన కృషి స్పష్టంచేస్తుంది. ఆంధ్రప్రదేశ్ ఉత్పత్తి రేటు గరిష్ఠ స్థాయికి చేరుకునే దశ నుచూపు మేరలో ఉన్నప్పటికీ ఆలస్యంగా ప్రారంభించబడిన కారణంగా పారిశ్రామికీకరణ తగు స్థాయిలో జరగడంతో ఆ లక్ష్యాన్ని చేరుకోలేక పోయినాము. 1965 లో ఉత్పత్తి తో కూడిన తలసరి సగటు విలువ జాతీయ స్థాయిలో రూ. 31.3 ఉండగా రాష్ట్ర స్థాయిలో రూ 12.9 మాత్రమే ఉంది.

పైన పేర్కొన్న కారణాంవల్లనే విశాఖ ఉక్కు కర్మాగార నిర్మాణం ప్రారంభం కావడం ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ముదావహమైన విషయం. వ్యవసాయమే ప్రధానమైన మన ఆర్థిక వ్యవస్థలో యథోచిత అభివృద్ధికి, మార్పుకు అవకాశాలు కల్పించే యీ కర్మాగారంపై యిక్కడి ప్రజలు ఎన్నో ఆశలు పెట్టుకున్నారు.

విశాఖపట్నంలో నెలకొల్పబడే యీ ఉక్కుకర్మాగారం ద్వారా దిగువ తెల్పిన ప్రయోజనాలు కలుగుతాయని ఆశించబడుతున్నది.

(1) రాష్ట్రంలో ఉన్న రూ 12.90 ఉత్పత్తికి చెందిన తలసరి సగటు విలువ రూ. 60 లకు పెరుగుతుంది.

(2) రాష్ట్ర ఆదాయంలో ప్రస్తుతం 9 శాతం ఉన్న పరిశ్రమల రంగం వాటా, 18 శాతానికి పెరుగుతుంది.

(3) పారిశ్రామిక రంగానికి మూల ప్రాతిపదిక అయిన కర్మాగారఉత్పత్తి శక్తి 38 శాతం నుండి 70 శాతానికి పెరుగుతుంది.

(4) పరిశ్రమల విద్యుచ్ఛక్తి వినియోగం ప్రస్తుతం ఉన్న 1 300 మిలియనుల యూనిట్ల నుండి 1,900 మిలియనుల యూనిట్లు పెరుగుతుంది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పారిశ్రామిక వినియోగ శక్తి దాదాపు 65 శాతం నుండి 75 శాతానికి పెరుగుతుంది.

(5) రాష్ట్రంలో తలసరి విద్యుచ్ఛక్తి సగటు వాడకం ప్రస్తుతం ఉన్న 55 శాతం నుండి 76 శాతానికి పెరుగుతుంది

(6) రాష్ట్రంలో తలసరి విద్యుచ్ఛక్తి సగటు వాడకం ప్రస్తుతం ఉన్న 45 కెడబ్ల్యుటిల నుండి 65 కెడబ్ల్యుటిలకు పెరుగుతుంది.

(7) ఉక్కు కర్మాగారం నిర్మాణ దశలో ప్రత్యక్షంగా 40,000 మందికి, ఉత్పత్తి ప్రారంభించిన తర్వాత 20,000 మందికి పరోక్షంగా అనుబంధ, సర్వీసు పరిశ్రమల్లో దానికి రెండింతల మందికి ఉపాధి లభిస్తుంది.

(8) ఉక్కు కర్మాగారం ఏర్పాటుతో విశాఖపట్నానికి మద్రాసు బొంబాయి, కలకత్తా వగైరాలతో సమానమైన స్థాయిలభిస్తుంది. ఇది వరకే పనిచేస్తున్న నూనెశుద్ధి కర్మాగారం హెవీ ప్లేట్స్ వెస్సల్స్ ఫ్యాక్టరీలు, నిర్మాణంలో ఉన్న తుత్తునాగం ఫ్యాక్టరీల ఫలితంగా ఈ ప్రాంతమంతా రసాయనాలు, పెట్రోలు రసాయనాలు. ఇంజనీరింగ్ పరిశ్రమల స్థావరంగా రూపొందుతుంది.

ఈ ఉక్కు కర్మాగారం స్థాపనతో విశాఖపట్నం, పరిసర ప్రాంతాలేకాక రాష్ట్రమంతా ప్రభావితమై ఆధునిక ఆర్థిక ప్రగతితో విలసిల్లుతుందని చెప్పవచ్చు.

## పరిశ్రమలకు పట్టుకొమ్మ

రాష్ట్రమంతటా అనుబంధ పరిశ్రమలు, సర్వీసు పరిశ్రమలు, యితర పరిశ్రమల విస్తరణకు మన యీ ఉక్కు కర్మాగారం పట్టుకొమ్మకావాలని నేను ఆశిస్తున్నాను. ఇటువంటి భారీ పరిశ్రమల ఏర్పాటుతో జిల్లా పట్టణాల పారిశ్రామికీకరణకు దోహదం కలుగుతుంది. గత 15 సంవత్సరాల కాలంలో దేశమంతటా నెలకొల్పబడిన యిటువంటి పెద్ద పరిశ్రమల వల్ల ఆశించిన ఫలితాలు కలుగక పోతే దానికి కారణం యాజమాన్య లోపంగాక వాటిని నెలకొల్పిన తీరు తెన్నులే కారణంగా భావింపవచ్చు ఇటువంటి పరిశ్రమల స్థాపనతో అక్కడి పరిసర ప్రాంతాలలో అనుబంధ పరిశ్రమలు అభివృద్ధి చెందలేదు. ఈ భారీ పరిశ్రమలకు అనుబంధ పరిశ్రమలకూ మధ్య తగిన అనుసంధానం కలిగించేవిషయంలో యోజనకర్తలు విఫలులైనారు.

అందువల్ల యీ కర్మాగారం విషయంలో హిందూస్థాన్ ఉక్కు సంస్థ, మన రాష్ట్ర పరిశ్రమశాఖ సంయుక్తంగా కృషి చేసి, భవిష్యత్తులో నెలకొల్పదగిన యితర కొత్త పరిశ్రమలకు, ఈ కర్మాగారం మధ్య ఫలప్రదమైన పరస్పర సహకారం ఉండే

విధంగా దీర్ఘకాలిక ప్రాతిపదిక పైన పథకాలను రూపొందించాలని నేను భావిస్తున్నాను.

ఇది ఏవిధంగా చేయదగునో నేను సలహా చెప్పలేను. ఈ పనిని మన పరిపాలనావేత్తలు, యింజనీర్లు సాధించాలి.

మనస్సుంటే మార్గం తప్పకుండా లభిస్తుందని నా వంటి సామాన్యునికి అనిపిస్తుంది. దృఢదీక్ష నిర్మాణాత్మకమైన ప్రణాళిక వ్యవస్థతో మనకు గల ప్రత్యేక సమస్యలకు ఆచరణీయమైన పరిష్కారమార్గాలను కనుగొనవచ్చు. ఉదాహరణకు ఉక్కు కర్మాగారానికి అవసరమైన వర్కుషాపులను తీసుకోండి. యాజమాన్యానికి బహుశా రెండు మార్గాలు ఉండవచ్చు. ఒకటి అన్ని అవసరాలకు కావలసిన వర్కుషాపులను రూపొందించి నెలకొల్పడం—రెండు కేవలం కర్మాగారానికి కావలసిన భారీ అవసరాలకు సంబంధించిన వర్కుషాపులను నెలకొల్పడం మిగతా అన్ని అంశాలను ఉత్పత్తి విషయంలో పరిశ్రమలశాఖ సహాయంతో మధ్యతరహా, లఘు పరిశ్రమలు నెలకొల్పడానికి ముందుకు వచ్చే రాష్ట్రంలోని పారిశ్రామిక వేత్తలను ఎంపిక చేయాలి. వారి ద్వారా యీ కర్మాగారానికి అవసరమైన అనుబంధ పరికరాలను పొందవచ్చు.

ఈ ఏర్పాట్లకు సంబంధించిన పథకాన్ని రూపొందించడంలో గల ఇబ్బందులను గూర్చి నేను తక్కువగా అంచనా వేయడంలేదు. ఐతే భారీ పరిశ్రమలయూనిట్లు ప్రత్యేకంగా పబ్లిక్ రంగంలోని యూనిట్లు యిటువంటి యిబ్బందులను సవాలుగా స్వీకరించాలని నేను భావిస్తున్నాను.

ఈ కారణాలన్నిటి దృష్ట్యా ఆంధ్ర ప్రదేశ్ ప్రజల స్వయం అభివృద్ధిసాధన కృషిలో యీ ఉక్కుకర్మాగారం మైలురాయిగా ఉంటుంది.

ఆంధ్ర ప్రదేశ్ దృక్పథానికి సంబంధించినంత వరకు, ఇతర రాష్ట్ర ప్రభుత్వాలతోపాటు గతంలోకంటే ఇప్పుడు ముఖ్యంగా విద్యావంతులైన, నిరుద్యోగులైన యువతీ యువకులకు ఉపాధికల్పన, నూతన ఆర్థిక అవకాశాలు కల్పించాలి. రాష్ట్రంలో ప్రాంతీయ అసమానతలను తొలగించడం, ప్రణాళికాఫలితాలను అందరికీ అందుబాటు చేయడంవంటి సమస్యలను పరిష్కరించాలి.

రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో ఆర్థిక వ్యవస్థవల్ల ఏర్పడిన ప్రాంతీయ అసమానతలను తొలిగించే సమస్యను ఆంధ్ర ప్రదేశ్ ఎదుర్కొంటున్నది.

## తెలంగాణా—రాయలసీమ

ఆంధ్ర ప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వ్యవసాయం పైననే ఆధారపడివున్నందువల్ల వృత్తి ఉద్యోగావకాశాలు వ్యవసాయం ఉద్యోగాల వరకు మాత్రమే పరిమితమై వున్నాయి. మన ఆర్థిక వ్యవస్థ వ్యవసాయం, సర్వీసులు ఈ రెండు రంగాలతో కూడివుందని చెప్పవచ్చు. ఐతే ఆంధ్రప్రాంతంలో మాత్రమే వ్యవసాయం లాభసాటిగావుంది తెలంగాణా రాయలసీమలలో వ్యవసాయంమెట్ట సేద్యం పైన ఆధారపడి వుంది. అందువల్ల విద్యావంతులైన యువకులకు ఉద్యోగావకాశాలకు మధ్య హస్తిమశకాంతరమైన భేదం వుంది. ఈ పరిస్థితులవల్ల పట్టణాలు గ్రామాలలో వ్యవసాయయితర రంగాలలో విస్తృత ప్రాతిపదికపైన ప్రజలకు ఉపాధికల్పించడానికి పరిశ్రమలను ఏర్పాటు చేయాలి. సాంకేతిక పరిజ్ఞానం తదనుగుణంగా అభివృద్ధిచెందాలి.

ఇంతవరకు మనప్లానింగులో దీనిని విస్మరించడం జరిగింది. ఈలోపాన్ని సరిదిద్దడానికి దృఢసంకల్పంతో మనం మన విధానాలను కార్యక్రమాలను రూపొందించవలసి వుంది. ఈలోపం పర్యవసానంగా జిల్లాఆర్థిక వ్యవస్థలలో ఏర్పడిన తక్కువఆదాయం తక్కువ ఉత్పత్తి తక్కువ వినిమయం అనే విషవలయాన్ని అంతమొందించవలసి వుంది. పారిశ్రామిక ప్రగతి మందకొడిగా వుండడం, వ్యవసాయంవల్ల తగినంత లాభం లేకపోవడం ఇవి తెలంగాణాలో 1969లో ప్రాంతీయ ఆందోళనకు మూలకారణాలైనాయి.

నేడు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను ఎదుర్కొంటున్న జటిలమైన సమస్య ప్రగతి సాధ్యమా కాదా అనేది కాదు. ఏవిధంగా ప్రగతి సాధించాలనేదే ఇప్పుడు మనల్ని ఎదుర్కొంటున్న సమస్య. ఆంధ్రప్రదేశ్ సమీకృతమైన ప్రగతి సాధించడానికి పారిశ్రామిక రంగంలో పురోగమించడానికి ఉక్కు కర్మాగారం ప్రభావం చాల వుంటుందనేది వాస్తవమైన విషయం. అయితే వ్యవసాయం, పరిశ్రమల రంగాలు ప్రగతి రేటు హెచ్చినంతమాత్రాన ప్రణాళికల ఫలితంగా మన ఆర్థిక పరిస్థితులలో ఆదాయాల మార్పిడి విషయంలో ఉత్పన్నమైన జటిల సమస్యలు పరిష్కారం కాజాలవు.

అభివృద్ధి, ప్రగతివల్ల ప్రణాళికల ఫలితాలు ప్రజలకు అందజాలవని ప్లానింగుకు సంబంధించిన వారందరికి ఇప్పుడు స్పష్టంగా విదితమవుతున్నది. సువిశాలమూ విభిన్నమూ అయిన మన దేశంలో ప్లానింగులో ఏవి అతిముఖ్యమైనవి; అనే అంశాన్ని గురించి తీవ్రంగా ఆలోచించవలసి వుంటుందని గత దశాబ్దపు రాజకీయ ఆర్థిక పరిణామాలు సూచిస్తున్నాయి.

## సాంఘిక ప్రయోజనం

గత 15 ఏండ్ల అభివృద్ధిలో క్రమేణా, నిక్కచ్చిగా జరిగిన ఆర్థిక సాంఘిక మార్పులు మనల్ని ఒక సమస్య నుండి మరొక సమస్యకు తరుము తున్నాయి. ఆదాయం మార్పిడికి సంబంధించిన అనేక జటిల సమస్యలు ఇప్పుడు మనల్ని ఎదుర్కొంటున్నాయి అనేకవిధాలుగ తలెత్తుతున్న ఈ కొత్త సమస్యలకు సమాధానాలు ప్లానింగును గురించి సాంప్రదాయకంగా వున్న పరిజ్ఞానం నుండి లభ్యంకాకపోవచ్చు ఒక విషయం మాత్రం గమనించాలి. నేటి మనదేశ పరిస్థితులలో వ్యక్తిగత ప్రయోజనాలు, సాంఘిక ప్రయోజనాలకూ మధ్య ఏర్పడిన ఘర్షణలను

పాశ్చాత్యుల అనుభవంతో ప్రమేయం లేకుండ పరిష్కరించేందుకు విధానాలను రూపొందించ వలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ మేరకు మన దేశంలో ఏర్పడిన పరిణామాల పోకడ సాంప్రదాయకమైన పరిజ్ఞానానికి శత్రువుగా ఏర్పడినట్లు తోస్తున్నది

1951 నుంచి ప్లానింగు క్రింద పారిశ్రామికీకరణ చాలా పురోగమించింది. ఐతే మనది ప్రధానంగా వ్యవసాయమే ప్రాతిపదికగా వున్న ఆర్థిక వ్యవస్థగల దేశం. సహజ సంపదలలో వ్యత్యాసాలు వున్నాయి పట్టణాలు, అసంఖ్యాక గ్రామాలను కూడా తగిన విధంగా పారిశ్రామికాభివృద్ధి పథంలోకి తీసుకొని రావడానికి వీలుగా పరిశ్రమల అభివృద్ధి పద్ధతిని తీర్చి దిద్దాలి. ఇదే మనల్ని ఎదుర్కొంటున్న సమస్య. కనుక వ్యవసాయ రంగంలో మిగులుగా వున్న మానవ శక్తిని పరిశ్రమల రంగానికి తరలించడానికి సాధ్యపడునట్లుగా మన పారిశ్రామికీకరణ పద్ధతులను రూపొందించడం ఇప్పుడు చాల అవసరం.

గత పదిహేను సంవత్సరాలలో జరిగిన పారిశ్రామికాభివృద్ధిలో ఆంధ్రప్రదేశ్‌కు కొంతవాటా వచ్చింది. ఐతే భారత దేశంలో ఇతరచోట్ల వలనే హైదరాబాదు విశాఖపట్టణం వంటి పెద్దపట్టణాలలో తప్ప. పారిశ్రామిక ప్రగతివల్ల చెప్పుకోదగిన విస్తృత ప్రభావాలు కలుగలేదు. తత్ఫలితంగా పెద్ద పట్టణాలు కూడ అభివృద్ధి పథానికి ఆధునికీకరణకు దూరంగా వుండిపోయినాయి. లఘుపరిశ్రమలు కూడ హైదరాబాదు, విజయవాడ విశాఖ పట్టణాలలో మాత్రమే కేంద్రీకృతమైనాయి.

దీని ప్రభావం ఏమంటే, జనాభాలో బహు కొద్దిమంది మాత్రమే పారిశ్రామిక "హరిత విప్లవాల" ఫలితాలు అనుభవిస్తున్నారు. విశేష ప్రజానీకం ముఖ్యంగా విద్యావంతులైన యువకులకు పారిశ్రామికీకరణ ఫలితాలలో తగిన వాటా లభింపచేయడం నేటి ప్రభుత్వాలను ప్రణాళిక వేత్తలను ఎదుర్కొంటున్న కఠినాతి కఠినమైన సమస్యగా పరిగణించాలి.

1951 లో ప్లానింగును చేపట్టి నప్పటినుంచి కొత్త యువతరం ముందుకు వచ్చిందని మనం ముఖ్యంగా ఇక్కడ గుర్తించుకోవాలి. ప్రతి జిల్లా కేంద్రంలోను, ఇతర పట్టణాలలోను, విద్య పూర్తి చేసుకొని, ఆ విద్యకు తగిన మార్కెటు లేకుండా వున్న యువతీ యువకుల సంఖ్య విపరీతంగా పెరిగిపోతున్నది.

హైదరాబాదు, విశాఖపట్టణంలో వున్న భారీ పరిశ్రమలను ప్రోత్సహించడం కొనసాగుతూ వుంటుంది. అయితే అవి జిల్లా ఆర్థిక వ్యవస్థలో ముఖ్యంగా వర్షాధారమైన వ్యవసాయంలో నిమగ్నులైన ప్రజలకు కొత్త ఆర్థికావకాశాలను కల్పింప జాలవు. వాటికి అట్టి అవకాశం లేదుకూడా. కనీసం 20అం. వర్షపాతం కూడ లేని కొన్ని జిల్లాల విషయంలో ఇది మరీ వాస్తవమైనది. ఉదాహరణకు అనంతపురం జిల్లా. వర్షాభావానికీ, వెనుకబడినతనానికీ గురైన ఇట్టి జిల్లాలు అభివృద్ధి ఫలితాలు అనుభవించకుండా సదా దూరంగా వుంటాయని మనం ఆశించ కూడదు. కనుక ఇట్టి ప్రాంతాలలోని ప్రజలు కూడా మన రాష్ట్ర సిరిసంపదలలో పాల్గొనడానికి వీలుగా పరిశ్రమలు ఇతర అభివృద్ధి కార్యక్రమాలను మనం రూపొందించాలి.

## యువతీయువకులకు అవకాశాలు

పట్టణాలు గ్రామాలలో కూడా, పారిశ్రామిక అవకాశాలు కల్పించడానికి మనం నూతనవ్యవసాయపద్ధతులను రూపొందించాలి. విద్యావంతులైన యువతీ యువకులకు రాష్ట్రమంతటా తగిన విధంగా ఆర్థికావకాశాలు కల్పించడం మనల్ని ఎదుర్కొంటున్న అత్యంత ప్రధానమైన సమస్య. ప్రజానాయకులు, పరిపాలనా వేత్తలు, ప్రణాళికా వేత్తలు, సాంకేతిక నిపుణులను ఎదుర్కొంటున్న సమస్య ఇది. పాశ్చాత్యదేశాలు పారిశ్రామికీకరణను సాధించాయి. భారీ పరిశ్రమల ద్వారానే ఇవి అధిక ఫలితాలను సాధించాయి. గత 15 ఏండ్లుగా మనం కూడా ఈ పద్ధతులనే అనుసరిస్తూ వచ్చినాము. అయితే వాటివల్ల మన ప్రజలకు అటువంటి సౌభాగ్యాన్ని సంతరించలేక పోయినాము. అందువల్ల మన సహజ సంపదలకు, సాంఘిక అవసరాలకు అనుగుణమైన విధానాలను రూపొందించుకోవాలి.

అమెరికా వారు సూక్ష్మాతి సూక్ష్మమైన సాంకేతిక పద్ధతులను పెంపొందించి మానవుని చంద్రమండలానికి పంపినారు. అదేవిధంగా మన సాంకేతిక వేత్తలు ఇంజనీర్లు కూడా మన చిన్న పట్టణాలు, గ్రామీణ ప్రాంతాల ప్రత్యేక అవసరాలకు పరిస్థితులకు అనువైన సాంప్రదాయక సాంకేతిక విధానాలను రూపొందించేందుకు కృషి చేయాలి.

గ్రామీణ పట్టణ ప్రాంతాల మధ్య పరస్పర విరుద్ధమైన పరిస్థితులు వున్నందువల్ల కలకత్తాలో నేడు విపరీత పరిస్థితులు ఏర్పడినాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఇట్టి పరిస్థితి ఏర్పడకూడదని నా ప్రగాఢ వాంఛ. ప్రణాళికా రహితమైన పారిశ్రామికీకరణ ఫలితంగా పశ్చిమ బెంగాలు నేడు సాంఘికంగా చాల చితికిపోయింది. భారీ యెత్తున ప్రజలలో ప్రబలిన ఇంత అసంతృప్తి సాంఘిక అవ్యవస్థ మరి ఏ దేశంలో కూడా ఏర్పడలేదు. ఇక్కడ ఇట్టి పరిస్థితులు ఏర్పడకుండా వుండడానికి మనం సర్వ విధాలా కృషిచేయాలి.

ఆంధ్రప్రదేశ్ సౌభాగ్యానికి నూతనాధ్యాయం సృష్టిస్తున్న ఈ ఉక్కు కర్మాగార నిర్మాణ ప్రారంభోత్సవానికి నేను యెదురు చూస్తున్నాను.

# ఉక్కు ఉత్పత్తికి ప్రణాళిక

బలిరాం భగత్

ప్రస్తుతం ఉక్కు సరఫరాల విషయంలో మనం కొరత పరిస్థితులను యెదుర్కొంటున్నాము. వివిధ వర్గాల ఉక్కుకు దేశంలో గిరాకీ యెక్కువ కావడమే ఇందుకు కారణం. ఒకవిధంగా ఇది శుభసూచకమే. ఎందుకంటే ఇది వివిధ రంగాలలో మన పారిశ్రామిక కార్యకలాపాల ప్రగతిని ప్రతిబింబింప చేస్తుంది. ఇటీవల మన దేశంలో ఏర్పడిన మాంద్యం నుంచి మన దేశం బయటపడిందనడానికి ఇది సూచన. ప్రణాళికాబద్ధమైన ఉక్కు ఉత్పత్తి శక్తి ఆరురెట్లు పెరిగింది. ఈ కాలంలో మన దేశం మన ఆర్థిక వ్యవస్థలో గొప్ప మార్పును చూచింది. సుమారు పదేండ్ల క్రిందట భారత దేశ ఆర్థిక వ్యవస్థ ముఖ్యంగా వ్యవసాయంపైననే ఆధారపడి వుండేది. వివిధ రకాల యంత్రాలు, రవాణా బండ్లు, ట్రాక్టర్లు, విద్యుచ్ఛక్తి పరికరాలు మున్నగునవి మాత్రమే కాకుండా సైకిళ్ళు, కుట్టుమిషనులు, గడియారాలు, బ్లేళ్ళు కూడా దిగుమతి చేసుకోవలసి వచ్చేది. అయితే ఇప్పుడు పరిస్థితి చాలా మారిపోయింది. మనం అనేక రకాల ఇంజనీరింగు వస్తువులను ఉత్పత్తిచేయడమే కాకుండా యంత్రాలను తయారుచేసే అధునాతన యంత్రాలను కూడా ఉత్పత్తి చేస్తున్నాము. కొన్నేండ్ల క్రిందట ఏమాత్రమూ ఉత్పత్తి కానటువంటి ఇంజనీరింగు వస్తువులను ఇప్పుడు ఉత్పత్తిచేసి విదేశాలకు ఎగుమతి చేస్తున్నాము. 1966–70లో రూ. 100 కోట్లకు మించిన విలువగల ఇంజనీరింగు వస్తువులను ఉత్పత్తిచేసినామంటే అది మన దేశవస్తువులు అభివృద్ధి చెందిన దేశాలతో విదేశీ మార్కెట్లలో పోటీ చేయగలవని తెలుపుతుంది.

పారిశ్రామిక ఆర్థిక ప్రగతికి ఉక్కు చాలా అవసరం. సైకిళ్ళు, బ్లేళ్ళు, కుట్టుమిషనులు, ఎలక్ట్రిక్ పంకాలు, ఇతర విద్యుచ్ఛక్తి పరికరాలు, రెఫ్రిజరేటర్లు, ఏర్–కండిషనర్ల నుంచి స్టెయిన్‌లెస్‌స్టీల్ పాత్రలు, ఉక్కు ఫర్నీచరు, నీటిపంపులు, భవన నిర్మాణానికి ఉపయోగపడే ఉక్కు కడ్డీలు మున్నగువాటి వరకు ఉక్కు అనేక విధాలుగా ఉపయోగపడుతుంది. ఉక్కు సరఫరా లేనిదే వ్యవసాయం కూడా అభివృద్ధి చెందలేదు. ఎందుకంటే, రసాయనిక ఎరువులు క్రిమిహారకమందులు ఉత్పత్తికి ఉపయోగపడే యంత్రాలకు, గొట్టంబావులు, ట్రాక్టర్లు, నీటిపంపులు, స్తంభాలు, గ్రామీణ విద్యుదీకరణకు తీగెలు వ్యవసాయ పనిముట్లు, కొడవలి సలికె పార, గడ్డపార, కొడవలి మున్నగు వాటికన్నిటికీ ఉక్కు అవసరమవుతుంది. గ్రామీణ ప్రాంతాలలో గృహనిర్మాణం పనులకు, విద్యుచ్ఛక్తి సరఫరా మున్నగు అభివృద్ధి కార్యక్రమాలకు ఉక్కు కొరకు గిరాకి యెక్కువవుతున్నది. ఇప్పుడు మన రక్షణ ఉత్పత్తి సంస్థలు కూడా అభివృద్ధి చెందినాయి. పారిశ్రామిక వస్తువుల ఎగుమతులు అనేక రెట్లు పెరిగాయి. ఈ విధంగా దేశావసరాలకు, విదేశీ యెగుమతులకు ఉక్కు డిమాండు పెరుగుతున్నది. ఇది వాంఛనీయమైన పరిణామం.

> ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ విశాఖపట్టణం ఉక్కు కర్మాగారం నిర్మాణం పనికి ప్రారంభోత్సవం జరపడం, దేశం శీఘ్రగతిని పారిశ్రామిక ప్రగతి ద్వారా స్వయంశక్తిగల ఆర్థికవ్యవస్థ వైపు పురోగమింపజేసే కృషిలో మన దృఢసంకల్పానికి చిహ్నం.

1960 మార్చిలోనే పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు: "మీరు ఎంత ఉక్కు ఉత్పత్తిచేసినా కూడా అది మీకు చాలదు......నిర్మాణం మాత్రమే కాక డిజైనింగు కూడా చాల ముఖ్యమైనది. అయితే, పాఠం నేర్చుకొని. స్వయం సమృద్ధిని సాధించడానికి ఉత్తమమైన మార్గం ఏమంటే దీనిని మనం స్వయంగా చేస్తూపోవాలి" ఇప్పటి నుంచి ఇంక 20 ఏండ్లలో మనకు 4 కోట్ల టన్నుల ఉక్కు అవసరమవుతుందని అంచనా వేయబడింది.

ఉక్కు డిమాండును అదుకొనడానికి ప్రస్తుతపు టిస్కో (టి ఐ యస్.సి.ఒ.) ఇస్కో (ఐ.ఐ.యస్ సి.ఒ)ల ఉత్పత్తిశక్తిని యెక్కువ చేయడానికై అనుమతి ఇవ్వాలని 1950 ఆరంభంలో నిర్ణయించబడింది. ఆ పరిశ్రమలో భారీ యెత్తున పెట్టుబడి పెట్టిన ఫలితంగానూ, దీని జాతీయ ప్రాముఖ్యతదృష్ట్యానూ.



విశాఖ పట్టణంలో ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ

ముందు ముందు ప్రభుత్వ రంగంలో ఉక్కు పరిశ్రమ అభివృద్ధి చెందాలని కూడా నిర్ణయించబడింది. తత్ఫలితంగా భిలాయ్, రూర్కేలా, దుర్గాపూరులలో ప్రభుత్వరంగంలో కొత్తగా మూడు కర్మాగారాలు ఏర్పాటు చేయబడినాయి. ఆ తర్వాత వీటి ఉత్పత్తి శక్తిని సాలీనా 30 లక్షల టన్నుల నుంచి 59 లక్షల టన్నుల వరకు హెచ్చించడానికి కూడా నిర్ణయించబడింది. ఈ కర్మాగారాలను నెలకొల్పడానికి మూడు దేశాల సహాయం తీసుకొన్నాము. భిలాయ్ లోని ఫ్యాక్టరీకి రష్యా నుంచి, రూర్కేలాలో పశ్చిమ జర్మనీ నుంచి, దుర్గాపూర్‌లో బ్రిటన్ నుంచి సహాయం పొందినాము. ఈ ఫ్యాక్టరీలన్నింటిలో ఆధునిక సాంకేతిక పద్ధతులు ఉపయోగించబడినాయి. వాస్తవంగా ప్రపంచంలోకంతటికి కొత్త యల్‌డి పద్ధతిని ప్రయోగించిన మొట్టమొదటి ఉక్కుఫ్యాక్టరీలలో రూర్కేలా ఒకటి. అప్పటికింకా ఈ పద్ధతి ప్రయోగాల దశలోనేవుండింది. ఆతరువాత మనం బొకారోలో నాల్గవ ఉక్కు ఫ్యాక్టరీని నెలకొల్పినాము. ఈ ఫ్యాక్టరీ రెండవ దశలో ఉత్పత్తి శక్తిని 50 లక్షల వరకు పెంచడానికి ఇటీవలనే నిర్ణయం తీసుకొన్నాము

ప్రస్తుతం ఉన్న ఉక్కు కొరతను తీర్చడానికి కొన్ని స్వల్పకాలిక చర్యలు తీసుకోవడం జరిగింది. ఉక్కు పంపిణీని క్రమబద్ధంచేసి అసలైన వినిమయదారునికి మధ్యవర్తి ద్వారాకాక సాధ్యమైనంతవరకు నేరుగానే ఉక్కుసరఫరా చేయడానికి సంకల్పించబడింది. ఈ లక్ష్యసిద్ధికై పంపిణీ పద్ధతిని సక్రమంగా అమలుపరచడానికి తరచుగా సమీక్షచేస్తున్నాము. దీనితోపాటు ఉక్కు దిగుమతులకు సంబంధించిన నియమావళిని సడలించడానికి కూడా కొన్ని చర్యలు తీసుకొన్నాము. పారిశ్రామిక కార్యకలాపాలు తాత్కాలికంగా అయినా కుంటుపడకుండా వుండటానికి ఈ చర్యలు దోహదకారి అవుతాయి.

భవిష్యత్తులో ఉక్కు పరిశ్రమ అభివృద్ధి చెందడానికి వీలుగా కొన్ని దీర్ఘకాలిక ప్రణాళికలు రూపొందించబడినాయి. దేశంలో పారిశ్రామికాభివృద్ధికి తగినట్లుగా శీఘ్రగమనంలో ఉక్కుడిమాండు హెచ్చుతుందని మేము భావిస్తున్నాము. అందుకని సగటున సాలీనా పది లక్షల టన్నుల ఉత్పత్తి శక్తిగల కొత్త ఉక్కు కర్మాగారాలను నిర్మించే అవసరం ఏర్పడుతుందని భావించినాము. ఈ విధంగా చేసినట్లయితే వచ్చే పదేండ్లకాలంలో ప్రస్తుత ఉత్పత్తి శక్తి మొదటిదశలో రెట్టింపుఅవుతుంది. విశాఖపట్టణం, హొస్పేట, సేలంలలో మూడు కొత్త ఉక్కు ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి ఇదివరకే ఒక నిర్ణయం చేసినాము. ఈ కర్మాగారాల నిర్మాణంలో స్వయంసమృద్ధి సాధించడమే మన ధ్యేయం. ఈ కార్యక్రమం అతిశీఘ్రంగా అమలు జరగడానికి మేము సర్వవిధాలా కృషి చేయడానికి పూనుకొన్నాము.

## ఇంతకాలం ఎందుకు పడుతుంది?

కొత్త ఉక్కు ఫ్యాక్టరీని నిర్మించడానికి ఇంతకాలం ఎందుకు పడుతుంది? అభివృద్ధి దేశాలలో కూడా ఇరవై లక్షల టన్నుల శక్తిగల కర్మాగారాన్ని డిజైను చేసి, నిర్మించి, ఉత్పత్తి లభించడానికి 5 నుంచి 7 సంవత్సరాలు పడుతుంది. ఇతర దేశాల నుంచి ప్రతివస్తువునూ దిగుమతి చేసుకొన్నట్లయితే, మనం కూడా ఇంతేకాలంలోపల ఫ్యాక్టరీని నిర్మించవచ్చు. అయితే సదా ఇతర దేశాల సహాయంపైన మనం ఆధారపడలేము. అభివృద్ధిచెందుతున్న దేశంలో డిజైను రూపొందించడం, దేశవాళీ పరికరాలను ఉత్పత్తి చేయడం అంటే చాల వ్యవధి అవసరం. ఇట్టి కృషిలో పాల్గొనగల పరిశ్రమలకు ఉక్కు ఫ్యాక్టరీల సమస్యలు కొత్తవి. అమెరికా, రష్యా, జర్మనీ, బ్రిటన్, జపాన్ వంటి దేశాలప్రమాణాలకు అందుకొనడానికి ముందు, మనం ఈ దశను అధిగమించవలసి వుంటుంది

ఇప్పుడు డిజైను, అభివృద్ధి ఉత్పత్తి, నిర్మాణశక్తి సామర్థ్యాలను మనం సంతరించుకొన్న దశకు చేరుకొన్నాము. అదేవిధంగా, ఈ ఫ్యాక్టరీలకు సంబంధించి విపులమైన ప్రాజెక్టు నివేదికలు తయారుచేయడానికి మనదేశంలో తగిన కన్సల్టన్సీ నిపుణతవుంది. బొకారో ప్రాజెక్టు విస్తరణ కార్యక్రమాన్ని పూర్తిగా దేశీయ కన్సల్టన్సీ సంస్థలకు వప్పగించడానికి సూత్రప్రాయంగా ఇదివరకే నిర్ణయం తీసుకొన్నాము. ఈ సంస్థలలో సెంట్రల్ ఇంజనీరింగ్ అండ్ డిజైన్ బ్యూరో, ప్రిన్సిపల్ కన్సల్టెంట్‌గా వుంటుంది. కొన్ని నిర్దిష్టవిషయాలలో యం. యన్. కస్తూర్ అండ్ కో కన్సల్టెంట్‌గా వ్యవహరిస్తుంది. కొత్త ఉక్కు ఫ్యాక్టరీలకు కూడా దేశంలోనే కన్సల్టెన్సీ ఏర్పాట్లు చేయబడుతాయి.

మునుముందు ఫ్యాక్టరీలను నిర్మించే విషయంలో ప్రభుత్వ ప్రయివేటు రంగాలలోని ప్రస్తుతపు పారిశ్రామిక శక్తిని పరిపూర్ణంగా వినియోగించడానికి సంకల్పించబడింది హెచ్.ఇ.సి. మాతృక కర్మాగారం వంటిదే. గతంలో ఇవి అంతబాగా పనిచేయక పోయినప్పటికీ ఇది చేపట్టిన పనులు సక్రమంగా అమలు జరగడానికి వీలుగా దీనిని భారీయెత్తున పునర్వ్యవస్థీకరించడం జరుగుతున్నది. గత కొద్దిమాసాల నుంచి ఇది అభివృద్ధిచెందిందని చెప్పవచ్చు. భవిష్యత్తులో దీనినుంచి ఆశించిన పనులు సక్రమంగా నెరవేరగలవనే విశ్వాసం మనకు కలుగుతున్నది.

రిఫ్రాక్టరీల ఉత్పత్తిలో దేశవాళీశక్తి సామర్థ్యాలను అధిక ప్రాధాన్యతపైన పటిష్ఠం చేయడం అవసరమని బొకారో నిర్మాణంలో మనకు కలిగిన అనుభవం వల్ల తెలుస్తున్నది. కనుక ప్రభుత్వరంగంలో పాలీనా 1,00,000 టన్నుల శక్తితో భిలాయ్‌లో రిఫ్రాక్టరీ ఉత్పత్తియును ఏర్పాటు చేయడానికి ఒక నిర్ణయం తీసుకోబడింది. ఈ నిర్ణయంవల్ల గతంలో ఉక్కు ఉత్పత్తి అభివృద్ధిలో ప్రతిబంధకంగా ఏర్పడిన రిఫ్రాక్టరీల కొరత తీరుతుంది.

## లాభాలు

ప్రభుత్వ రంగంలోవున్న ఉక్కు ఫ్యాక్టరీల్లు ఎందుకు లాభాలు గడించడంలేదని తరచుగా ప్రశ్నించడం జరుగుతున్నది. కొత్త ఫ్యాక్టరీల మూలధనం ఖర్చు ఎక్కువగా వున్నప్పటికీ, ఈ విషయంలో ఇదే ప్రభుత్వ విధానమైవుంది. ఇతర ప్రాథమిక పరిశ్రమలకూ, మన ఆర్థికాభివృద్ధికి ఉక్కు అధిక ప్రాముఖ్యత వహిస్తున్న దృష్ట్యా ఉక్కు ధరను సమంజసమైన స్థాయిలో వుంచడానికి నిర్ణయం తీసుకోబడింది. చాలమంది ఈ విషయాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోలేదు. ఉక్కు ధరను పెంచి అధికలాభాలు చూపడం సులభసాధ్యం. అయితే ఇట్టి చర్యవల్ల వ్యవసాయం, పరిశ్రమ రంగాలు అభివృద్ధి దెబ్బతింటుంది. దీనివల్ల సాంఘికరీత్యా ఖర్చులు చాలపెరుగుతాయి. అయితే ఉక్కుపరిశ్రమ పనివిధానాన్ని మెరుగుపరచడానికి అవకాశం వుందనిమాత్రం అంగీకరించవలసిందే. ఇప్పుడున్న ఫ్యాక్టరీలు మునుముందు ఏర్పాటుఅయ్యే ఫ్యాక్టరీల్ల పనులను మెరుగుపరచాలి, ఈ విషయంలో అవసరమైన చర్యలు తీసుకోవడానికి మేము కృతనిశ్చయులమైవున్నాము.

ఈ ఫ్యాక్టరీలను ప్రభుత్వ రంగంలో మాత్రమే ఏర్పాటు చేయవలసిన అగత్యాన్ని కొంతమంది ప్రశ్నిస్తున్నారు. దేశ స్వాతంత్ర్యానంతరం, ఇట్టి ప్రాథమిక పరిశ్రమ ప్రభుత్వ యాజమాన్యంక్రింద ఉండడం శ్రేయోదాయకమని గుర్తించబడింది అంతేకాకుండా మరొక విషయం కూడాగుర్తుంచుకోవాలి. ఇరవై లక్షల టన్నుల శక్తిగల ఉక్కు ఫ్యాక్టరీని నిర్మించాలంటే సుమారు రూ. 600 కోట్ల మూలధనం పెట్టుబడి అవసరమవుతుంది. ప్రయివేటు రంగంలోని ఏ సంస్థకుకూడా సొంత వనరులతో ఇట్టి పని చేపట్టడం సాధ్యం కాదు. ప్రభుత్వ ఆర్థిక సంస్థలనుంచి ఈ ఫ్యాక్టరీలకు సహాయం లభించవలసివుంటుంది.

## "అభివృద్ధి కేంద్రం"

సువిశాలమైన మన దేశంలో, స్థానిక సహజ వనరులను దృష్టిలో పెట్టుకొని అభివృద్ధి కార్యక్రమాలలో ప్రాంతీయ సమానతకొరకు కృషిచేయాలనేది స్పష్టమైన విషయం మన దేశంలో మధ్య ప్రాంతంలోను దక్షిణ ప్రాంతాలలోను విస్తారంగా లభిస్తున్న లోహ ఖనిజములను ఉపయోగించవలసిన అవసరం ఎంతైనావుంది. కనుకనే, కొత్త ఉక్కు ఫ్యాక్టరీ స్థలంకొరకు విశాఖపట్టణాన్ని ఎన్నిక చేయడం జరిగింది. ఈ పట్టణం, ఇదివరకే పారిశ్రామిక కార్యకలాపాలకు ముఖ్యకేంద్రంగా రూపొందింది. ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమైన "అభివృద్ధి కేంద్రం" గా వుంది. ఇదివరకే ఇక్కడ తైలశుద్ధి కర్మాగారం, నౌకా నిర్మాణాశ్రయం, రసాయనిక ఎరువుల కర్మాగారం, లోహ ఖనిజం ఎగుమతికి పెద్ద రేవు వున్నాయి. విశాఖపట్టణంలో భారత్ హెవీ ప్లేట్స్ అండ్ వెసల్స్ లిమిటెడ్ పనిచేయనారంభించింది ఇది మరొక ముఖ్యమైన ప్రాజెక్టు. రసాయనిక ఎరువులు, రసాయన పదార్థాల యంత్రాల ఉత్పత్తికేకాకుండా, ఉక్కు పరిశ్రమ అవసరాలనుకూడా ఇది తీర్చగలదు భారీ రసాయనిక పరిశ్రమలు, ఉక్కు పరిశ్రమలకు అత్యవసరమైన పరికరాలను ఉత్పత్తి చేయడానికి వీలుగా ఈ ఫ్యాక్టరీ అభివృద్ధికై రూపొందించబడిన పథకం, విషయంలో ఎంతో ముందడుగు వెయడం జరిగింది. ప్రసిద్ధి పొందిన విదేశీ కంపెనీల సహకారం చూరగొనడానికి ప్రతిపాదనలు ఇప్పుడు పూర్తి అయ్యే దశలో వున్నాయి.

ఈ రోజు ఆంధ్రప్రదేశ్ యొక్క పారిశ్రామికాభివృద్ధిదశలో ఒక మైలురాయి వంటిది. ఉత్తరోత్తరా, ఈ కొత్త ఉక్కు ఫ్యాక్టరీ, దాని అనుబంధ పరిశ్రమలు ఈ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిపథంలో మార్చివేయడానికి సహాయకారిగా వుంటాయి. కొత్తగా అనేక అనుబంధ పరిశ్రమలు అవతరిస్తాయి. ఈ ఉక్కు ఫ్యాక్టరీలో పెట్టిన పెట్టుబడి ఫలితంగా అనేక నూతన అవకాశాలు సృష్టించబడుతాయి, రాష్ట్ర ప్రభుత్వము, స్థానిక అధికారులు, ఇతర సంబంధించిన ఏజెన్సీల సహకారంతో అనతికాలంలోనే ఈ ఫ్యాక్టరీ పనిచేయనారంభించగలదని నాకు విశ్వాసం వుంది. ఈ ప్రాజెక్టు ఒక నూతన అవకాశం కల్పిస్తున్నది అయితే ఇది ఆంధ్రప్రదేశ్ ప్రజలకూ, ఉక్కు, భారీ ఇంజనీరింగు మంత్రిత్వ శాఖలోవున్న మాకుకూడా ఒక సవాలు వంటిది. ఈ ఫ్యాక్టరీ ఎంత త్వరగా ఉత్పత్తి ఆరంభిస్తే, అంత త్వరగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మిగతా భారతదేశం ఆర్థిక ప్రగతికి సిరిసంపదల అభివృద్ధికి దోహదం కలుగుతుంది.





# చైత్రారంభ వేళ

—రాళ్ళపల్లి సుందరం

మనదేశపు పూర్వ సంస్కృతీ సంప్రదాయాలు మనం చేసుకొనే ఉత్సవాలలో, పండుగలలో ప్రతి ఫలిస్తూ ఉంటాయి. సంవత్సరమంతా కష్టాలతోను సుఖాలతోను మిశితమైన జీవనం గడుపుతూ ఉండే మనకు ఏదో కొంత ఉల్లాసాన్నీ ఉత్సాహాన్నీ ఇస్తాయి పండుగలు. ఆపండుగలలో సంవత్సరానికి ఆదిగా మన హృదయాలలో పన్నీటిజల్లులు కురిపించే మొదటి పుణ్యదినం ఉగాది. అన్నిమాసాల్లోకి మొదటి మాసమైన చైత్రమాసం ఉగాదితో ప్రారంభమవుతుంది. ఈచైత్రమాసానికి గల ప్రాముఖ్యాన్ని గూర్చి తెల్పడమే ఈ వ్యాసోద్దేశం.

సంవత్సరమును గుణించడంలో మనకు అయిదు పద్ధతులున్నాయి; అవి 1. చాంద్ర 2. సౌర 3. సావన 4. నాక్షత్ర 5. బార్హస్పత్య. సౌరమానం సూర్యునికి సంబంధించినది. సూర్యుడు మేష రాశిలో ప్రవేశించిన దినంనుండి మీనరాశిని విడిచేదినం వరకు దీనిని లెక్కిస్తారు. పంద్రెండు రాశులను గడవడానికి సూర్యునికి 365 దినాలు పడుతుంది. అందువల్ల సౌరసంవత్సరం 365 దినాలు. ప్రపంచంలో ఎక్కువగా గణించేది ఈ లెక్కనే,

భారత దేశంలో చాలామందికి అలవాటయినది చాంద్ర మానము. చైత్రమాసముతో మొదలై ఫాల్గుణముతో ముగుస్తుంది. చైత్రశుద్ధ పాడ్యమి మొదలు దీనికి చంద్రుని గతిననుసరించి గుణించే ఈ పద్ధతిలో సంవత్సరానికి 354 దినాలు అవుతాయి. సౌరవత్సరము, చంద్ర వత్సరముల లెక్క జ్యోతిర్గణితమునకు సంవదింపవలెనన్న చాంద్రవత్సరము వారు 33 నెలలకొక అధిక మాసాన్ని చేర్చుకోవాలి.

సావన సంవత్సరాన్ని ఎక్కువగా వ్యాపారస్థులు ఉపయోగిస్తారు. వీళ్ళకు ప్రతి నెలకు 30 దినాలు. 12 నెలలకు 360 దినాలు. చాంద్రమాన సౌరమానాల సూక్ష్మగణితాన్ని వీళ్ళు లెక్కచేయరు. వాళ్ల వ్యవహారాలకు ఇది సులభమైనా జ్యోతి శ్శాస్త్రమునకు సరిపడదు. గురుగ్రహం గతిననుసరించి గుణించే వానికి బార్హస్పత్య వత్సరమంటారు. ఒకరాశిని దాటి మరోరాశిని చేరడానికి గురువుకు 361 దినాలు పడుతుంది. ఇది సామాన్యులకు అస్పష్టమైనది.

మనం సంవత్సరాన్ని 12 మాసాలుగా విభజించుకున్నాము. చాంద్రమానములో ఇటువంటి మాసములు పంద్రెండు ఉన్నవి. చైత్రాదిగ ఫాల్గుణము వరకు ఉండే వీటి పేర్లు నక్షత్రాల వల్ల వచ్చాయి. చిత్ర, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణం, పూర్వాభాద్ర, ఆశ్విని, కృత్తిక, మృగశిర, పుష్యమి, మఘ ఉత్తర పల్గుణి అనే పండ్రెండు నక్షత్రాల వల్ల ఈ పేర్లు వచ్చాయి. ఈ నక్షత్రాలనడకను బట్టికూడ కొందరు గుణిస్తారు. దానికి నాక్షత్ర మానమని పేరు. ఈ సంవత్సరానికి 324 దినాలే అవుతాయి.

ఇకచైత్రమాసం విషయం. చైత్ర మాసంలో అసలు సంవత్సరానికే ప్రథమమైన చైత్ర శుద్ద పాడ్యమి ఒక విశిష్టమైన పండుగ. ఈ పండుగకు చాలా విశిష్టత ఉన్నది. దీని వెనుక బోలెడంత, ఇంకా మాట్లాడితే, కల్పాంత మంత చరిత్ర ఉంది. ఇప్పుడు మనము ఉండేది శ్వేత వరాహకల్పము. ఈ కల్పము ప్రారంభమైనది చైత్ర శుద్ధ పాడ్యమి నాడే. ఇక మన కలియుగము ప్రారంభమైనది ఈనాడే. అంతేకాదు. యుధిష్ఠిర శకము శాలివాహన శకము కూడ ఈ దినమే ప్రారంభమయ్యాయి. ఇన్ని కారణాల వల్లనే మనం ఈ పండుగను సంవత్సరాది, అని యుగాది 'అని' కల్పాది 'అనీ పిలుచుకొంటున్నాం'. ఈ క్రొత్త సంవత్సరాది కేవలం నాగర జనుల్లోనే కాదు. జానపదులలో కూడా వినూత్నమైన భావాలను వెదజల్లుతుంది. వాళ్లకు నూతన ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ఆ దినం మనం ఉగాది పచ్చడి చేసుకుంటాం. సుఖదుఃఖభయాశ్చర్యాది వివిధ భావాల సమ్మిశ్రితమైన మనజీవితం లోని రుచులను తెలిపే ఆపచ్చడిని ప్రీతిగా హాయిగా ఆరగిస్తాము. అంతేకాదు.!

చలికాలంలో ఆకులన్నీ రాలిపోయి ఉంటాయి. చైత్ర మాసం రాగానే కొత్త కొత్త చిగుళ్లతో నూత్న శోభతో వెలుగుతూ ఉంటాయి వృక్షాలు. వేపపూల వింత సుగంధాలు మాధవీలతల సుమ భార సౌరభాలు మామిళ్ల చిన్ని చిన్ని పిందెల సొబగులు మన హృదయాలను ఆకర్షిస్తాయి. పడమటిగాలి సూర్యుని వెచ్చవెచ్చని కిరణాల ఘర్మబిందువుల్ని తుడిచి సేద తీరుస్తుంది. వసంత ఋతువు ప్రథమ స్థానాన్ని చైత్రమాసం ఆక్రమిస్తుంది. ఇక

వసంత ఋతువును గూర్చి కృష్ణభగవానుడు "ఋతూనాం కుసుమాకరః" అని చెప్పే ఉన్నాడు.

పాత ఫాల్గుణ మాసం వెళ్లిపోయింది. వింత వింత చెల్వులతో చైత్రమాసం వేతెంచింది. క్రొత్త క్రొత్తగా చిన్న చిన్న పన్నీటి జల్లులను తెస్తుంది. నూతన వర్షంతో బాటు నూతన వర్షాలు ప్రారంభమవుతాయి. ఈ వసంతకాలప్రథమారంభం ప్రాధాన్యం ఎంతయినా చెప్పవచ్చు. మనం ఒకరికి ఇన్నివేళ్ల వచ్చాయి అని చెప్పడానికి ఆయన నలభై వసంతాలు చవిచూచాడు అని చెప్పడం అలవాటే కదా.

చైత్రమాసంలో కోయిల కుహూకుహూరవలు, మకరంద రసాస్వాదన కోసం తిరిగే భ్రమరాలు మనకు వినూత్న చైతన్యాన్ని స్తాయి. చైత్రమాసంలో ఉగాది తరువాత మనకు అత్యధిక ఉత్సాహాన్నీ భక్తినీ ఇచ్చే ప్రధాన పర్వదినం శ్రీరామనవమి. చైత్రశుద్ధ తదియ శ్రీమన్నారాయణుని మత్స్యావతార జయంతి దినము గూడా ఈ తదియనే కొందరు 'గౌరీతదియ'అను పేర ఈ దినం నుండి ప్రారంభించి 'వసంత గౌరి' పూజ ఒక నెలవరకు చేస్తారు.

శ్రీరామనవమి సంగతి చెప్పనక్కర లేదు. ముఖ్యంగా ఆంధ్రులు సీతమ్మ నాకు తల్లి, శ్రీరాముడు నాకు తండ్రి' అని నమ్మి భక్తితో, ఆప్యాయతతో ఈ దినం జరుపుతుంటారు. ఆ దినం విధిగా వడపప్పు, పానకం చేసి విసన కర్రలు బహుమతి నిచ్చి, అందరికీ సౌఖ్యాన్ని ప్రసాదిసారు. చైత్రపౌర్ణిమకు హనుమజ్జయంతి అని పేరు. ఈ పున్నమ నాడే హనుమంతుడు పుట్టెనట. శ్రీరామచంద్రుడు పుట్టిన మాసమే. ఆయనకు దగ్గరగా పుట్టిన ఆంజనేయుడు ఎంత పుణ్యము చేసికొనెనో!

చైత్రమాసం ఉపనయనాలకు అత్యుచితమని ధర్మ నిర్ణయము. వివాహకార్యాలకు ఇది నిషిద్ధమైనా మీన రాశితో కూడిన చేయవచ్చు నంటారు.

వసంతకాల శోభను ఎందరో కవులు వర్ణించారు అటు శబ్దానికీ ఇటు అర్థానికీ వీనుల విందుగా రామరాజ భూషణుడు వసంతకాలాన్ని వర్ణిస్తూ వ్రాసిన ఒక పద్యాన్ని ఉదహరించి ముగిస్తాను.

లలనా జనాపాంగ వలనావస దనంగ తులనాభి కాభంగదోః ప్రసంగ
మలసాని లవిలోల దళసాసవరసాల ఫల సాదర శుకాలపన విశాల
మలినీగరు దనీక మలినీకృత ధునీకమలినీ సుఖితకోక
కులవధూక

మతి కాంత స లతాంతలతికాంత రనితాంత రతి కాంత రణతాంత
సుతనుకాంత

మకృతకా మోదకుర వకా వికలవకుల
ముకుల సకల వనాంత ప్రమోద చలిత
కలిత కలకంఠ కుల కంఠ కాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు,

[ఈ వ్యాసమునకు ముఖ్యాధారము. 'నమ్మ సంస్కృతి పరంపరె కన్నడ ' గ్రంథము : శ్రీ బి. కృష్ణశర్మ.]

---

# మా రచయితలు

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ముఖ్యమంత్రి
శ్రీ బలిరామ్ భగత్. కేంద్ర ఉక్కు భారీపరిశ్రమల మంత్రి
శ్రీ రాళ్లపల్లి సుందరం. ఎం. ఎ, తెలుగు లెక్చెరర్. చింతామణి. మైసూరు రాష్ట్రం.
శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, హైదరాబాదు
డా॥ అక్కిరాజు రమాపతిరావు. తెలుగు అకాడమీ, హైదరాబాదు
శ్రీయం. చంద్ర శేఖరయ్య, చిత్తూరు
శ్రీ.బి.ఎ. పద్మనాభరావు, నెల్లూరు
శ్రీ. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, హైదరాబాదు
కీ. శే. గుమ్మిడిదల వెంకట సుబ్బారావు
అచ్యుతుని లక్ష్మీకనకవల్లి, తెనాలి.

# సమైక్య ఆంధ్రప్రదేశ్

గుమ్మిడిదల వెంకట సుబ్బారావు

ఈ శతాబ్దం ఆరంభంలో, ఆంధ్రులు విభజింపబడి మద్రాసు మైసూరు. హైదరాబాదు, మధ్య భారత రాష్ట్రాలలో వుండేవారు వీరునివసించిన ప్రాంతాలు అనేక సందర్భములలో ఒకదానికొకటి ఆనుకొని వుండినాయి. వివిధ రాష్ట్రాలలో విభజింపబడి వున్న ఆంధ్రులతో కూడిన సమైక్య ఆంధ్ర రాష్ట్రం ఏర్పడాలని అనేక ఆంధ్ర నాయకుల ఆశయమై వుండింది.

విశాల ఆంధ్రావని అవతరించాలని ఆశించిన మహనీయులలో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు ప్రప్రథములు. తమిళులకు అగస్త్య మహర్షి ఏలాంటివారో, ఆంధ్రులకు కొమర్రాజు లక్ష్మణ రావు అలాంటివారు. ఆంధ్రుల మహోన్నతమైన సంప్రదాయాలు, సంస్కృతి, చరిత్రను వారికి చాటి చెప్పారు. మునగాలరాజు, తెలంగాణాకు చెందిన రావిచెట్టు రంగారావు గారల సహాయంతో ఆయన 1901 లోనే హైదరాబాదులో కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం స్థాపించినారు. ఆ తరువాత కొన్ని సంవత్సరాలకు ఆయన హైదరాబాదులోనే విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని కూడా స్థాపించారు. ఈ మహత్తర కృషిలో ఆయనకు హైదరాబాదులోని శ్రీ ఆదిపూడి సోమనాథ రావు, మైలవరపు నరసింహశాస్త్రి గారలు చాల సహాయం చేసినారు. ఈ మండలి ఏర్పాటు ద్వారా కొమర్రాజు ఆంధ్ర తెలంగాణా ప్రజల మధ్య ప్రగాఢమైన సత్సంబంధాలు ఏర్పాటు చేయడమే కాకుండా విశాలాంధ్రావని అవతరణకు పునాదులు వేసినారని శ్రీ దేవులపల్లి రామానుజరావు కొమర్రాజును కొనియాడినారంటే అందులో ఆశ్చర్యమేమీలేదు. ఆంధ్ర మహాసభ ప్రథమ మహాసభ 1913 లో బాపట్లలో జరిగింది. దీని ఆహ్వాన సంఘ అధ్యక్షులు శ్రీకొండా వెంకటప్పయ్య పంతులు తమ స్వాగతోపన్యాసంలో ఆంధ్రులుఅందరూ ఒకేజాతికి చెందిన వారని ఉద్ఘాటిస్తూ ఇలా అన్నారు. "మన ఆంధ్రులజనాభా 220 లక్షలకుపై బడివుంది. వీరిలో 157 లక్షల మందిమద్రాసు రాష్ట్రంలో నివసిస్తున్నారు. 50 లక్షల మంది హైదరాబాదులోను 10 లక్షల మంది మధ్య రాష్ట్రాలు, బొంబాయి, బర్మా తదితర ప్రాంతాలలోను నివసిస్తున్నారు." ఆంధ్రోద్యమము ఆంధ్రప్రజల అందరి సంక్షేమము కొరకు ఉద్దేశించ బడినదని ఆయన అన్నారు.

శ్రీ బి. యన్ శర్మగారు తమ అధ్యక్షోపన్యాసంలో ఇవే అభిప్రాయాలను పునరుద్ఘాటిస్తూ ఇలా అన్నారు." "ఆంధ్రోద్యమము, ఆంధ్ర మహాసభలు ఏ ఒక్క రాష్ట్రానికీ పరిమితమైలేవు. అయితే సంక్షేమ కార్యక్రమములను తెలుగు భాష మాట్లాడే ప్రజలు, వారు ఎక్కడ వున్నా, ఏ రాష్ట్రానికి చెందివున్నా, అందరికీ వర్తింప చేయడమే మన సంకల్పం."

ఈ ఆశయానికి అనుగుణంగానే, ఆ కాలంలో శ్రీ జొన్నావిత్తుల గురునాథం, ఉన్నవలక్ష్మీనారాయణ పంతులు ఆంధ్ర చిత్రపటములను రూపొందించి వాటిల్లో తెలంగాణా జిల్లాలు, మైసూరు రాష్ట్రంలోని కోలారుజిల్లాను చేర్చినారు. ఈ ప్రాంతాలు వివిధ రాజకీయ పరిపాలనల క్రిందవున్నట్లు తెలుప డానికి మాత్రమే వీటిని వివిధ రంగులలో చూపించడం జరిగింది.

అయితే ఒకే రాష్ట్రంలో భవిష్యత్తులో తెలుగుభాష మాట్లాడు ప్రజల సమైక్యతను సూచించిన ఘనత ఆంధ్ర భీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుకు చెందింది. 1914 లో బెజవాడ (విజయవాడలో) జరిగిన ద్వితీయ ఆంధ్ర మహాసభకు అధ్యక్షత వహించిన సందర్భంలో ఆయన ఇలా ఉద్ఘాటించినారు.

"భాషా ప్రాతి పదికపైన వివిధ రాష్ట్రాల సరిహద్దులను బహుశా స్వదేశ సంస్థానాలను కూడా పునర్వ్యవస్థీకరించ వలెనని ప్రజలు ముక్తకంఠంతో కోరిన ఫలితంగా కానీ, లేక కాలక్రమేణా తెలుగు జిల్లాల పరిపాలన అవసరాలు పరిస్థితుల ప్రోద్బలం దృష్ట్యా తెలుగు ప్రజలను ఒక ప్రత్యేక పరిపాలన క్రిందికి తీసుకొని రావడం వాంఛనీయమని భారత ప్రభుత్వం తలపోసే విషయం ఎవరు చెప్పగలరు? " దీర్ఘకాలంలో ఈ మాటలు వాస్తవమైనవని రుజువుకాలేదా.?

గాంధీజీ నాయకత్వం క్రింద 1920 లో నాగపూరులో కాంగ్రెసు సమావేశమై సమగ్రమైన రాజ్యాంగాన్ని రూపొందించింది. ఈ రాజ్యాంగం క్రింద సాధారణంగా భాషాప్రాతి పదిక పైన దేశమంతా 20 భాగాలుగా విభజింప బడింది. రాష్ట్రాల ప్రాంతాలు సంబంధించినంత వరకు " రాష్ట్రాల కాంగ్రెసు కమిటీ లేక

కమిటీల కోరికలను పరిశీలించిన తరువాత వర్కింగు కమిటీ కొత్త రాష్ట్రాన్ని కానీ, లేక ఒక రాష్ట్రంలోని జిల్లాను లేక జిల్లాలో కొన్ని భాగాలను గానీ ఇతర రాష్ట్రంలో చేర్చడం కానీ లేదా స్వదేశ సంస్థానం లేక సంస్థానాలను లేదా కొన్ని ప్రాంతాలను ఇతర రాష్ట్రానికి కేటాయించడం కానీ చేయవచ్చు'' అని రాజ్యాంగంలో పేర్కొనబడింది. తదనుగుణంగా, ఈ నిబంధన క్రింద తెలంగాణా ప్రాంతం ఎ.పి.సి.సి కి వప్పగించబడినట్లు తెలుస్తున్నది. ఈ ప్రాంతానికి చెందిన ప్రతినిధులను కొన్ని సంవత్సరాల వరకు ఎ.పి.సి.సి. కి ఎ.ఐ.సి.సి. ఎన్నుకోబడడం లేక కో-ఆప్ట్ చేసుకోవడం జరిగింది స్వదేశ సంస్థానాల వ్యవహారాలలో కాంగ్రెసు జోక్యం చేసుకోకూడదని, ఒక విధానం అనుసరించబడినప్పటికీ కొంతకాలం తర్వాత, ఈ విధానం ఆచరణలో పెట్టడం జరుగలేదు.

1920-35 మధ్య పదిహేనేండ్ల వరకు ఆంధ్రోద్యమం మాటు మణిగి వుండినప్పటికీ అది 1936 లో పునరుద్ధరించబడింది. ఈ దశలో నేను ఆంధ్ర దేశమును త్రిసీమగా అభివర్ణించాను. ఇందులో సర్కారు, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు చేరి వున్నాయి.

"ఇవన్నీ ఒకటే
మేమంతా ఆంధ్రులము
నీవు ఆంధ్రుడివైనట్లయితే
దీన్ని ధైర్యంగా చాటిచెప్పు."

1936 ఫిబ్రవరి గోష్ఠి లో ప్రచురించిన వ్యాసంలో హైదరాబాదులోని ఒక రచయిత సవాలుకు నేను ప్రత్యుత్తరమిచ్చినాను. ఆయన హైదరాబాదు భవిష్యత్తు విషయాన్ని ప్రస్తావించి నిర్దిష్టంగా ఇలా అడిగినారు. "ఆంధ్ర నాయకులు హైదరాబాదు రాష్ట్ర రాజకీయ సమగ్రతను, భౌగోళిక సమగ్రతను యథాతథంగా వుంచదలచుకొన్నారా లేక బ్రిటీష్ ఇండియాలోని తెలుగు ప్రాంతాలతో తెలంగాణా జిల్లాలను, హైదరాబాదులోని మరాట్వాడా జిల్లాలను బ్రిటీష్ ఇండియాలోని మరాఠీ ప్రాంతంలోను కలుపదలచుకొన్నారా?

యూరప్ ఖండంలో అలుముకొంటున్న యుద్ధమేఘాలు, భారతదేశంలోని రాజకీయ చైతన్యం, ఆలిండియా ఫెడరేషన్, కొన్ని రాష్ట్రాలు, సంస్థానాల పునర్వ్యవస్థీకరణ సమస్యలను గురించి ఈ రచయితకు తెల్పుతూ గోష్ఠిలో ఇలా వ్రాశాను.

''భాషారాష్ట్రాల సూత్రానికి కాంగ్రెసు ఎల్లప్పుడూ కట్టుబడి వుంది. ప్రభుత్వంకూడా ఈ సూత్రాన్ని అంగీకరించింది. ఈ విషయం ఎల్లరకూ తెలిసినదే. ఈ సూత్రాన్ని ఆధారంగా చేసుకొనే సింధు, ఒరిస్సా రాష్ట్రాలు కొత్తగా అవతరించినాయి. భాషా రాష్ట్రాన్ని సాధించడానికి ఆంధ్ర, కర్ణాటక, బహుశా మహారాష్ట్రంలోకూడా కొన్ని ఉద్యమాలు బయలుదేరుతున్నాయి. ఆంధ్ర రాజకీయపార్టీలు, ప్రదేశ్ కాంగ్రెసుకమిటీ తెలంగాణాను విస్మరించలేదు. ఆంధ్ర స్వరాజ్యపార్టీ లక్షణాలలో సర్కారు జిల్లాలు, దత్తమండలము లేకాక తెలంగాణా జిల్లాలుకూడా చేరి వున్నాయి. ఇది మా ఆశయం. ఎప్పుడు ఏ విధముగా ఈ మహదాశయం, సిద్ధిస్తుందో. భవిషత్తు నిర్ణయించవలసిన విషయం అయితే స్వరాజ్యపార్టీకి సంబంధించినంతవరకు, న్యాయయుతంగా, రాజ్యాంగబద్ధమైన పద్ధతులద్వారా సర్కారు, రాయలసీమ, తెలంగాణా ప్రజల సంపూర్ణ సహకారంతో ఇది సాధించవచ్చని మేము చెబుతున్నాము. అయితే అంతిమంగా నిజాము ప్రభుత్వము, భారత ప్రభుత్వము, బ్రిటిష్ ప్రభుత్వము దీనికి అంగీకారము తెలుపవలసి వుంటుంది." ఈవ్యాసము హైదరాబాదు ప్రభుత్వంలో గొప్ప సంచలనము కలిగించింది.

## 1936 నాటి ఆంధ్ర ప్రభలు

1936వ సంవత్సరపు ఉగాది ఉత్సవాలలోను ఆ తరువాత బెజవాడ (విజయవాడ) గుంటూరు తదితర ప్రాంతాలలో జరిగిన ఉత్సవాలలోను ఆంధ్రరాష్ట్ర చిత్రపటములు ఆంధ్రప్రభలను అలంకరించినాయి. తెలంగాణాలోని తొమ్మిదిజిల్లాలు, మద్రాసు రాష్ట్రంలోని పండ్రెండు జిల్లాలే కాక మొత్తం ఇరువదినాలుగు జిల్లాలతోకూడిన ఆంధ్రదేశమును ఈ చిత్రపటములు చిత్రీకరించినాయి. 1937 అక్టోబరులో బెజవాడ (విజయవాడ) లో జరిగిన మహాసభ రజతోత్సవాల సందర్భములో వేలాది ప్రజలకు కొత్త ఆంధ్రరాష్ట్ర చిత్రపటములు పంచిపెట్టబడినాయి.

1913లో ఆరంభించబడిన ఈ మహాసభకు 1941 వరకు రాజ్యాంగంలేకుండా వుండింది సర్ విజయా అధ్యక్షతన విశాఖపట్నంలో సమావేశమైన ఈ మహాసభ ఆమోదించిన రాజ్యాంగములో ఆంధ్రదేశము ఈ విధముగా నిర్వచించబడింది. "మద్రాసు రాష్ట్రం, ఒరిస్సా, మధ్యరాష్ట్రం, హైదరాబాదు, మైసూరుమున్నగు రాష్ట్రాలలో తెలుగుభాష మాట్లాడుప్రజల ప్రాంతాలు." తరువాత దీనికి చేసిన సవరణలతో దీనిని పై ప్రాంతాలలో ఒకదానికొకటి అనుకొని వున్నప్రాంతాలు అని మార్చడం జరిగింది, అప్పటినుంచి మహాసభల అధ్యక్షులు తెలంగాణా ప్రజల వ్యవహారాలపట్ల శ్రద్ధాసక్తులు ప్రకటిస్తూ వచ్చినారు.

1946 లో గుంటూరులో జరిగిన మహాసభకు అధ్యక్షత వహిస్తూ సర్ విజయా ఇలా ఉద్ఘాటించారు. ''మనధ్యేయం విశాలాంధ్ర అనేది మనం మరచిపోకూడదు, ఇదివరకు మనం పోగొట్టుకున్న ప్రాంతాలను మనం తిరిగి సంపాదించి వాటిని విశాలాంధ్ర క్రింద సమైక్యతం చేయాలి" ఆ తరువాత కొంతకాలానికి సర్కారు జిల్లాలు తెలంగాణాలోని కమ్యూనిస్టులు విశాలాంధ్రకొరకు ఆందోళన లేవదీశారు. 1949లో శ్రీ ఎ. కాళేశ్వరరావు విశాలాంధ్ర మహాసభను స్థాపించినారు 1951లో గుంటూరు మహాసభ అధ్యక్షులుగా శ్రీ జి. హరి సర్వోత్తమరావు తమ ఉపన్యాసంలో ఈ విషయాన్ని గురించి విపులంగా ప్రస్తావించినారు. అంతిమంగా సమైక్య విశాలాంధ్ర అవతరించగలదని చెబుతూ, ఆంధ్రనాయకులు తెలంగాణా సోదరులపట్ల ఆభిజాత్యం ప్రదర్శింపకూడదని గట్టిగా హెచ్చరిక చేశారు.

అయితే ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య గారు హైదరాబాదు రాజధానిగా వివిధ ఆంధ్రప్రాంతాల రాజకీయ సమై

క్యత జరుగుతుందని జోస్యం చెప్పారు. ఆంధ్ర యూనివర్శిటీ విద్యార్థులు 1937లో వాల్తేరులో జరిపిన ఆంధ్ర అభ్యుదయ ఉత్సవాలకు ఆయన అధ్యక్షత వహించిన సందర్భములో ఇలా ప్రసంగించారు

"రాష్ట్రాలకూ, సంస్థానాలకూ మధ్య చాలా సన్నిహిత సంబంధంవుంది. ఈ సంబంధాన్ని సరిగా అర్థం చేసుకొంటేనే తప్ప భాషాప్రయుక్త రాష్ట్రాలు అవతరించలేవు. నేటివరకు ఆంధ్ర రాష్ట్రాన్ని గురించి తరచుగా చర్చలు జరుగుతూనే వున్నాయి. అయితే ఈ సమస్య కేవలం సర్కారు ఆంధ్రులు రాయలసీమ ఆంధ్రులకు మాత్రమే సంబంధించినట్లుగా వున్నవి. దీన్ని దృష్టిలో పెట్టుకొనే కొంతమంది ప్రముఖ నాయకులు రాయితీలను గురించి పరస్పర లావాదేవీలను గురించి చర్చలు కొనసాగిస్తున్నారు. దేశములో ప్రముఖ రాజకీయపార్టీ అయిన కాంగ్రెసుకూడా హైదరాబాదు, మైసూరు రాష్ట్రాలలో లక్షలాది ఆంధ్రులను విస్మరిస్తున్నది. ఆంధ్రుల భాష, సాహిత్యం, కళ, సంస్కృతి అభివృద్ధి చెందడానికి ప్రత్యేకరాష్ట్రం ఏర్పడడం అవసరమనే వాదన సత్యమైనపుడు— ఈ వాస్తవ విషయాన్నే ఈ మహాసభల మాజీ అధ్యక్షులు పునరుద్ఘాటిస్తూ వచ్చినారుకూడా. ఇది బ్రిటిష్ ఇండియాలోని ఆంధ్రులకేకాక, సంస్థానాలలోవున్న ఆంధ్రులకుకూడా వర్తిస్తుంది. మనం ఆశించిన ఆంధ్ర రాష్ట్రంలో ఒకదాని కొకటి అనుకొన్న ప్రాంతాలలో నివసిస్తున్న ఆంధ్రులందరు చేరినప్పుడు ఆ రాష్ట్రము సరియైనదవుతుంది. అప్పుడే మన మందరమూ మన రాష్ట్రంపట్ల గర్వపడవచ్చు. హైదరాబాదు మైసూరువంటి సంస్థానాల సమస్యనుకూడా పరిష్కరించినప్పుడే తప్ప అటువంటి రాష్ట్రమును సృష్టించడం ఏలా సాధ్యమవుతుంది."

కొంత మంది సంస్థానాధీశ్వరులు కొత్త రాష్ట్రాలకు రాజ్యాంగబద్ధమైన పాలకులుగా వుండడానికి ఆక్షేపణ వుండకూడదని చెబుతూ ఆయన ఇంకాయిలాఅన్నారు "ఈదృక్పథాన్ని అనుసరించే వారికి సంస్థానాధీశ్వరులు భాషాప్రయుక్త రాష్ట్రాల పరిపాలకులుగా వుండడానికి ఆక్షేపణ వుండదు. ఇందులో తప్పేమీలేదు కూడా. మైసూరు మహారాజా క్రింద కర్నాటక రాష్ట్రము. తిరువాన్కూరు మహారాజా క్రింద కేరళరాష్ట్రము. హైదరాబాదు నిజాముక్రింద ఆంధ్రరాష్ట్రము ఏర్పడినపుడు, ఇవి మనము ఆశించిన ఆదర్శవంతమైన భాషాప్రయుక్త రాష్ట్రాలుగా ఏర్పడుతాయి. నిజాము తనమరాట్వాడా జిల్లాలను మహారాష్ట్రకు, కర్నాటక జిల్లాలను కొత్త కర్నాటక రాష్ట్రానికి అప్పగించవలసివుంటుంది. అయితే ఆయన ఆంధ్రరాష్ట్రంలో మద్రాసు రాష్ట్రం, మైసూరులలోని తెలుగుజిల్లాలన్నీ చేరివుంటాయి, ఇది చాల పెద్ద రాష్ట్రమవుతుంది. అధిక జనాభావుంటుంది. అంతేకాకుండా ఆయన ప్రస్తుత రాజ్యంకంటె ఇది ఇంకా యెక్కువ ఐశ్వర్యవంతమైన రాష్ట్రముగా వుంటుంది. ఈ పద్ధతులపైన రాష్ట్రాలు ఏర్పడినపుడు ఇప్పుడు ప్రజలను ఆందోళనపరుస్తున్న కొన్ని సమస్యలు పరిష్కారం కాగలవు. కొత్తరాష్ట్రాల రాజధానులు ఎక్కడ వుండాలనే సమస్య ఉత్పన్నంకాదు. దేశంలోని సుందరమైన పెద్ద నగరాలలో ఒకటైన హైదరాబాదు ఆంధ్రులకు, మైసూరుకానీ లేక బెంగుళూరు కాని కర్నాటకులకు, కేరళకు త్రివేండ్రం, ద్రవిడరాష్ట్రానికి మద్రాసు, మహారాష్ట్రకు పూనా లేక బొంబాయి రాజధాని నగరాలుగా వుండగలవు. ఆంధ్రరాజధాని కృష్ణానదికి ఉత్తరదిశ వుండాలా ? లేక దక్షిణదిశ వుండాలా ? ఆంధ్రరాజధాని చిత్తూరు, అనంతపురం, బెజవాడలలో ఎక్కడ వుండాలి ? దేనికి ప్రాధాన్యత ఇవ్వాలి? హైకోర్టు ఒక స్థలంలో పరిపాలనా రాజధాని మరొక స్థలంలో వుండాలా, లేదా? అనే ప్రశ్నలు ఉత్పన్నం కావు." ఆయన చెప్పినమాటలు ఎంత వాస్తవమైనవి!

ఈ సంక్షిప్త సమీక్షను, అప్పటి హైదరాబాదు ప్రధాన మంత్రి ఛత్తారీనవాబ్‌కు సమర్పించిన అర్జీలోని కొన్ని భాగాలను ఉల్లేఖిస్తూ, ముగిస్తాను. 1944 జూలై 1వ తేదీన నవాబుకు ఇలా వ్రాశాను.

"ప్రస్తుత మద్రాసు, సి. పి రాష్ట్రాలు, హైదరాబాదు రాష్ట్రం తెలంగాణాలోని ఆంధ్రుల జాతి, భాష, సంస్కృతి చారిత్రిక విషయాలు, భౌగోళిక సమైక్యత మీకు బాగా తెలుసు. కృష్ణా గోదావరి నదీజలాలు, వాటి ఉపనదులే, ఆంధ్రులందరికీ జీవనాధారంగా వున్నాయి. కర్మవశాత్తు బ్రిటిష్‌రాజ్యం ఏర్పడి మమ్మల్ని రెండు ఖండాలుగా చేసేంతవరకు మాలోని ఐక్యతకు ఏ విధమైన భంగము వాటిల్లి వుండలేదని మీకు జ్ఞప్తికితెస్తున్నాను. భవిష్యత్తులో సార్వభౌమాధికారము, యాజమాన్యపు హక్కుల సమస్య విషయం నేను ప్రస్తావించదలచుకోలేదు. అయితే తాత్కాలికంగా వున్నటువంటి ఈ కృత్రిమ విభజన, మహాభారతంలోని జరాసంధునికథవలె. ముక్కోటి ఆంధ్రుల రక్తసంబంధాలను అవినాభావసంబంధాలను రెండు భాగాలుగా వేరుచేయడం, కొనసాగదనే విషయాన్ని మీరు అంగీకరిస్తారని భావిస్తున్నాను. కనుక మీరూ, నిజాము ప్రభుత్వమూ కలిసి ఈ రెండు ప్రాంతాల ప్రజల మధ్య సన్నిహితసంబంధాలు ప్రోత్సహించడానికి తోడ్పడగలరని అభ్యర్థిస్తున్నాను." నేను 1944లో వ్రాసిన ఈ మాటలు నేటికికూడా యధార్థమైనవని నేను భావిస్తున్నాను.

[శ్రీ గుమ్మిడిదల వెంకట సుబ్బారావుగారు ఇటీవలే స్వర్గస్థులయ్యారని తెలుపుటకు చింతిస్తున్నాము—సం]

# కుటుంబ నియంత్రణ నాడూ-నేడూ

అచ్యుతుని లక్ష్మీకనకవల్లి

మన వేదాలు, శ్రుతి స్మృతులు, ఉపనిషత్తులు సంస్కృత భాషలో వున్నాయి. వాటిని చదివి అర్ధము చేసుకొన గలిగిన వారిని వేళ్ళమీద లెక్కించ వచ్చు ఉపనిషత్తులలోను, స్మృతులలోను కొన్నిరకాల ఆహారం తీసుకోవటం వలన విజ్ఞానవంతులు, సౌందర్యవంతులు; కొన్ని నియమాలను పాటించటము వలన కోరుకున్నట్లుగా మగ లేక ఆడబిడ్డను పొందవచ్చు అని చెప్పబడిందిట. సంతానము లేనివారికి సంతానం కలిగే మార్గాలు, కుటుంబ నియంత్రణ మార్గాలు ( ఆంగ్లములో సేఫ్ పీరియడ్ అంటారు. అదే) కూడా సూచించ బడినాయిట. మనుస్మృతి మూడవ అధ్యాయము లోని 46, 48, 50 శ్లోకాల ద్వారా మగ లేక ఆడబిడ్డ ఏ నియమాలను పాటిస్తే కలిగేది తెలుస్తుందిట. 21-6-1970 సండే స్టేండర్డులో జై దయాళ్ డాల్మియా ఒక వ్యాసము వ్రాశారు. అన్నము పాలు, నెయ్యి కలిపి, అన్నము పెరుగు నెయ్యి ఇంకా యిలాగే కొన్ని రకాల ఆహారం తీసుకోవటమువల్ల విద్యాజ్ఞానం గల సంతానం కలుగుతుందని బృహదారణ్యక ఉపనిషత్తులో వున్నదని ఆ వ్యాసములో వ్రాశారు.

గర్భిణీ స్త్రీ మొదట పాలు అన్నముగాని, నెయ్యి అన్నము గాని భుజించాలి. కారం మొదట తినగూడదు. తింటే గర్భస్థ శిశువు కారాన్ని భరించలేక ఉక్కిరి బిక్కిరి అయి అవస్థ పడుతుంది. పాలు అన్నము తింటే సౌందర్య వంతులైన సంతానం కూడా కలుగుతుందని పెద్దలు చెప్పి గర్భిణీ స్త్రీ చేత పాల అన్నముగాని, నేతి అన్నముగాని ముందుగా తినిపించేవారు పూర్వం. నేడు యిలా చెప్పే పెద్దలు, ఆచరించే పిన్నలు క్రమేపీ తగ్గిపోయినారు.

నాడు భార్య భర్తకి ఎల్లవేళలా ఎడమ ప్రక్కనే వుండాలనే నియమము ఎందుకు పెట్టారు? సుపుత్రులను పొందటానికే. నేడు ఆ నియమాన్ని ఎల్లవేళలా పాటించే వారేలేరు.

ఆశ్రమ ధర్మాలను, వ్రత తిధి నియమాలను పాటించటము వలన నాడు కుటుంబ నియంత్రణ అమలు జరుపాలనిగాని, జరుపుతున్నామనిగాని ఆలోచనయే లేకుండా కుటుంబనియంత్రణ అమలులో వుండేది. జేష్ట కుమారునికి యుక్తవయస్సు రాగానే కుటుంబ బాధ్యతలను అప్పగించి వానప్రస్థాశ్రమములో జీవించే వారేకాని మనుమలతోనేకాక కోడళ్ళతో పాటు కనిపెంచేవారుకాదు.

నేడు కుటుంబ బాధ్యతలను వహించ శక్తిగల కుమారులు గాని, వానప్రస్థాశ్రమములో ప్రశాంతముగా జీవించే అవకాశంగాని లేదు కనుక వయస్సు మళ్ళిన తరువాత నిశ్చింతగా భగవధ్యానంతో కాలక్షేపం చేయటానికి వీలుగా కొంత వయస్సు మళ్ళిన తరువాత సంతానం కలుగకుండా వుండాలి. భగవద్గీతలో చెప్పినట్లు ముముక్షువులై వుండటం ఉత్తమము. అలా ప్రతివారు ఉండలేరు కనుక వేరేమార్గము అనుసరించడములో అనుచితమేమీలేదు.

నాటి మానవుని ఆయుఃప్రమాణం ఎంతో ఎక్కువ. నేటి మానవుని సగటు ఆయుఃప్రమాణం చాలా తక్కువ. కనుక షుమారు 40 సంవత్సరములు దాటిన తరువాత కలిగిన సంతానం యొక్క మంచిచెడ్డలూ, కష్టసుఖాలూ తల్లిదండ్రులు చూడజాలరు. ఈ సంతానం జ్యేష్టుల దయాధర్మం బిచ్చంపై ఆధారపడి జీవించ వలసినవారేకదా? యుక్తవయస్సులో కలిగిన సంతానం తల్లిదండ్రుల వయస్సు మళ్ళేటప్పటికి తమకాళ్ళపైరాము నిలబడశక్తి గలవారు అవుతారు, తల్లిదండ్రులను ఆదుకో గలుగుతారు. ముదిమిన పుట్టినబిడ్డ, అడవులో వేయనిపంట ఆపదలో ఆదుకోలేవు. అన్న సామెతా మన అందరికి తెలిసిందేకదా.

శ్రీకృష్ణ పరమాత్మ అష్టమ గర్భమున జన్మించాడు. అలాగే ఏ అష్టమ గర్భానో, సప్తమగర్భానో, జన్మించి చరిత్ర ప్రసిద్ధిగాంచిన కొందరిని చూచి కుటుంబ నియంత్రణవలన విద్యావిజ్ఞానం గల ప్రజలు లేకుండా పోతారేమోనని కొందరు తటస్థంగా వున్నారు. అలాగైతే శ్రీ ఆది శంకరులవారు, గౌతమబుద్ధుడు, తల్లిదండ్రులకు ఏకైక సంతానమేగదా. శ్రీ నెహ్రూజీ జేష్ఠులే గదా. రాణీ రుద్రమదేవి, శ్రీమతి ఇందిరాగాంధీ వీరంతా ఏకైక సంతానమేగదా. అవకాశం లేక చరిత్ర ప్రసిద్ధికెక్కని అపారమైన తెలివితేటలు గలవారు ఎందరోవున్నారు.

అత్యధిక సంతానం గలిగిన గాంధారి, దేవకి యిలా ఇంకా ఒకరిద్దరు తప్ప పరిమిత సంతతి గలవారే హెచ్చుగావున్నారని పురాణ యితిహాసములవలన మనకి తెలుస్తున్నది.

కొన్ని సామెతలు, ఆచారములవల్ల కూడా కుటుంబ నియంత్రణ ఆవశ్యకత నాడుకూడా బోధింపబడుచుండెడిదని స్పష్టమగుచున్నది. "ముగ్గురు పిల్లలు పుట్టితే తల్లి మూతి మీద వాతే" అన్న సామెతవల్ల ముగ్గురు పిల్లలు గలిగిన తర్వాత తల్లి సంపూర్ణ అహారం తీసుకోలేదని చెప్పబడింది మూడవ పురిటికి పుట్టింటికి పోకూడదు, పుట్టింటివారు పురిటిఖర్చు భరించకూడదు. అనే ఆచారము మూడవ బిడ్డనుంచి బాధ్యత తల్లిదండ్రులే వహించితే కష్టసుఖాలు తెలిసివస్తాయనే ఏర్పడింది గదా. అయితే ఈ ఆచారాన్ని వదలకుండా ఆచరించేవారు ఒక్క మూడవ పురిటికి మాత్రమే పుట్టింటికి వెళ్ళక తిరిగి నాలుగవ పురిటినుంచి పుట్టింటికే పోతున్నారు సింగినాదం అనుకునేవారు మూడవ పురిటికీ పుట్టింటికే వెళ్ళుతున్నారు

ఈ కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని సుమారు పది సంవత్సరములనుంచి ప్రభుత్వం చేపట్టి ముమ్మరంగా ప్రచారం చేసిలక్ష్యసిద్ధి సాధించాలని ప్రయత్నించటముతో యిదేదో కొత్తగా కనిపెట్టబడిందని భావించేవారు కొందరైతే, పాపమని భావించేవారు ఇంకొందరైతే ఇదే అదను చూచి కొన్ని ప్రతిపక్ష పార్టీలు వ్యతిరేక ప్రచారము సాగించాయి. విద్యావంతులైన ధనికులు ఎప్పుడూ కుటుంబనియంత్రణను అతి రహస్యంగా అమలు జరుపుతూనే వున్నారు. నిరక్షరాస్యులు, బీదవారు జనుము విత్తులు, బొప్పాయి పండు, యిప్పపువ్వు, నువ్వులనూనె, వెదురు చిగురు మొదలైన చెట్లమందులను వుపయోగించేవారు. యిప్పటికీ ఎంతో వెనకపడ్డ జిల్లాలలోని గ్రామాలలోని ప్రజలు చెట్ల మందులవలన గర్భ నిరోధాన్ని కలిగించు కొంటున్నారు కొందరు కుటుంబ నియంత్రణ పాపమని ప్రత్యేకంగా ఏ గ్రంధములోను చెప్పబడ లేదుట. కాని పోషించగల శక్తి, ధనసంపద గలవారు మాత్రము నాలుగు పెళ్ళిళ్ళు కూడ చేసుకొని సంతానాన్ని పొందవచ్చు అని చెప్పబడిందిట. ఇది గమనార్హము. (ఈ సంగతి బాగా తెలిసిన కొందరిని అడిగి తెలుసుకొన్నాను).

ప్రతిగృహిణి చక్కగా ఏ యిద్దరో ముగ్గురో పిల్లలు కలిగిన తరువాత తెరపిన పడితే. హాయిగా జీవించవచ్చునని భావిస్తుంది. అయినా ప్రభుత్వం యింత ప్రచారంచేసి ధనం వెచ్చిస్తున్నా ఆశించినంత ఫలితం రాకపోవటానికి కారణాలు ఏమిటి? I. అలవాటు లేనందున ప్రసవ సమయంలో ప్రాణం మీదికి వచ్చినా డాక్టరు దగ్గరకి పోవటానికి భయపడేవారు ఒక్కసారిగా ఆపరేషన్ అంటే హడలి పోతున్నారు. (2) ధైర్యంచేసి లూప్ వేయించుకొన్న వారిలో కొందరికి కొన్నిబాధలు కలుగుటవలన అదే ఆపరేషన్ అని భ్రమచెంది ఆపరేషన్ చేయించుకుంటే తనకీ అలాగే అవుతుందేమోనన్న భయం (3) క్యాంపులకి వెళ్ళి అందరికి తెలిసేలాగా ఎందుకు ఆపరేషన్ చేయించుకోవాలనే వుద్దేశ్యము. (4) గొప్పగా డాక్టర్లు మొదలైనవారు నిముషంలో చేస్తాము అర నిముషంలో చేస్తామని ప్రకటనలు చేయటంవలన కొందర్లో సరిగా ఆపరేషన్ చేయరేమోనని అనుమానం కొందరికి. (5) చెప్పినంత ఆదరణగా ఆపరేషను చేయించుకొన్న తరువాత చూడకపోవటం (6) చలికాలంలో, పనులకాలంలో క్యాంపులు ఏర్పాటుచేయుట (7) లక్ష్యసాధనకై ముసలి వారికి కూడా అక్కడక్కడా ఆపరేషన్లు చేయటంవలన వారికి తల నొప్పి దగ్గరనుంచి ఏదివచ్చినా ఆపరేషన్ వలననే అని అనుమానం కలుగుతున్నది (8) యిది దేశసమస్యగా పరిగణించి ప్రచారము చేయటంవలన కొందరిలో వ్యతిరేక భావం కలుగుతున్నది. ఇవి నా వూహలుకాదు కొన్ని జిల్లాలలోని, తాలూకాలలో కొన్ని సంవత్సరములుగా వింటున్న, తెలుసుకుంటున్న విషయాలు. ఇది అణుయుగము మానవశక్తి కంటె మేధాశక్తికే ఎక్కువ ప్రాముఖ్యం వున్నది. అసలు దేశసమస్యగా ప్రచారము చేయకుండా కుటుంబ నియంత్రణ మార్గాలను ప్రచారంచేసి, ఎప్పుడు వచ్చినా వుచితంగా ఆపరేషను చేయబడుతాయని, ఖర్చులు భరింపబడుతాయని ప్రచారంచేస్తే ఏ మాత్రము వ్యతిరేకత లేకుండా మంచి ఫలితం వస్తుందని నా అభిప్రాయం. ఆదిలాబాదు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో, చెట్ల మందులవలన శాశ్వతంగా గర్భ నిరోధం గలిగించగలిగే మందులు యిచ్చేవారు వున్నారు. వాటిని పరిశోధించి అట్టి వాటిని అమలులోకి తీసుకొని వస్తే గ్రామీణ ప్రజలు నిస్సంకోచముగా, నిర్భయంగా కుటుంబనియంత్రణ అమలు జరుపురారు.

---

నిజమైన జ్ఞానం అనే గట్టి పునాదుల మిదనే శాశ్వతంగా వుండే భవనం నిర్మించగలుగుతాం. పెరిగిన ఆలోచనలతో ఆకాశాన్ని అందుకునే ముందు నేలమీద పాదాలు నిలదొక్కుకోవాలి.

— శ్రీ అరవిందులు

స్వాతంత్ర్య సమరంలో పాల్గొని దేశమాతకు సేవ చేయడమే ఒక గొప్ప గౌరవం: అందులోనూ గాంధీజీవంటి నాయకుని క్రింద పనిచేయడం మహాభాగ్యం అని చెప్పాలి.

ప్రియమైన మాతృ దేశంకోసం త్యాగం చేయడంలో, స్వాతంత్ర్య లక్ష్య సాధన స్వప్నాలు ఫలింపజేసే కృషిలో వీర మరణం పొందడం కంటే మించిన అదృష్టం ఏముంటుంది భారతీయులకు?

— జవహర్‌లాల్ నెహ్రూ

---

# ఒక్కచెట్టు పువ్వులు

ముదిగొండ వీరభద్రమూర్తి

ప్రళయము వచ్చినఁ సొబగు
వారణసీపురి దగ్గ కల్గె యుం
టలు వినుపఁ బురాణములు
నమ్మరు కొందఱు కర్ణసాక్ష్య మై
కులమతభేదవాదముల
గ్రుంగక హైదరబాద రాజ్యమం
దెలయు జనైకమత్యము దృ
గింద్రియసాక్ష్యము సర్వసమ్మతిఁ.

జరిపించును, నిజాము జపహోమతర్పణా
ధ్వరముల శివకేశనార్చనముల
నయ్యా లెందఱొ యబ్దమబ్దమ్మ పీర్లకు
మొనసి చెల్లింతురు మ్రొక్కుబడులు
మియ్యా లెందఱొ దాన మిత్తురు ద్విజులకు
ప్రశ్నలగ్న ముహూర్త వాస్తుమతులు
నుభయోత్సవములందు నుభయులు మెఱవణి
నురవణించిన వేడ్కఁ బెరసి యుందురి

ఒండొరుల పండుగలయందు నురమునురము
నొరసికొనుచు లేనవ్వుల దొరసికొనుచు
నరసికొనుచు బాగోగుల వెరసి జనము
పొలప మొందు హైదరబాదు పురమునందు.

'భాయీ' యని పిలుచు 'హమా
రా'యని పేరు గొని పదుగురకు చెలి చేయుఁ
సాయిబు రావును. కలవు త
దీయగృహము లొక్కవాడ దిలతండులముల్.

ఒకతళియఁ మిఠాయి నిడి
యొక్కరి కొక్కరు ముక్క నందజే
సికొనుచు సంతకుఁ ఘనము
చిప్పిలు మాధురిమై ఛలోక్తులొ
త్తికొనుచు సంతకన్న కడు
తీయము సాయ మొనర్చికొంచు పీ
ర్లకు హనుమాన్లకుఁ వినతు
లం బచరించు జనం బెలర్చెడిఁ.

ఒకరి మంత్రి మొక్కరికి చెప్పికొనుచుంద్రు
యంత్రతంత్రవినిమయమ్ముతోడ
దొడ్డనిష్ఠ నెసగి దుర్గను దర్గాను
కొలుచువారు దగర దులుచువారు.

ఒక్కచెట్టుపువ్వులో యన వికసించి
యలరు భాగ్యపురిజనాళి కెంత
యుమ్మయేని దుర్భర మ్మనిపింపద
యేకమతులలోన మృతియు బెండ్లి.

తెలియఁవచ్చును గోష్ఠి కేగి భగవ
ద్గీతాఖొరానుక్త సూ
క్తుల తాత్పర్యసమైక్యముఁ మధురసే
ఘోదారవీచీవిజృం
భిల సద్వైఖరి నూగి శాస్త్రిలును మౌ
ల్వీల్ వాఙ్మఖం బాడుచో
చెలగున్ గోష్ఠుల వెన్నొ భాగ్యనగర
శ్రీమల్లికాకుంజముల్.

తేనెబుడ్లు మామిడిపండ్లు తిరుగనీక
మెడ నలము మల్లెదండలు వెడద గంప
లందు దెచ్చి సన్మానితు లైరి ఖాన్లు
శంకరజయంతినా డొక శాస్త్రియింట.

పండితుల బిలచి పిండుఁ
పిండు 'మిలాదున్నబీ' యని పిలువబడు మేల్
పండుగకుఁ ఖాన్లత్తరు
దండిగ నలది యొనరిచిరి తావుల గనులఁ.

ఖానుల నొక 'తుర్రేబాజ్'
ఖానుఁ మౌల్వీలలో నొకం 'డల్లావు
ద్దీనుఁ బేర్కొనదగువా
రీ నగరిఁ శౌర్యమూర్తి కిరు బాహువు లై.

# యాత్రికులకు స్వర్గధామం విశాఖపట్టణం

సుందరసాగరతీరం, మనోహరమైన ప్రకృతి సౌందర్యంతో ఆహ్లాదకరమైన శీతోష్ణస్థితి గలిగిన విశాఖపట్టణం, ఆంధ్రప్రదేశ్ లోని ప్రసిద్ధమైన యాత్రాకేంద్రాలలో ఒకటి "బ్రైటన్ ఆఫ్ ఇండియా," అని పేరు పొందింది. భారతదేశంలో సహజమైన రేవు ఇది ఒక్కటే వుంది. దేశంలోని ఏకైక నౌకా నిర్మాణ కేంద్రం ఇక్కడే నెలకొనివుంది. ఇవన్నీ ఈ పట్టణానికి శోభను కలిగిస్తున్నాయి. ఇక్కడ రసాయనిక ఎరువుల కర్మాగారం, కాల్టెక్స్ తైలశుద్ధి కర్మాగారం, భారత హెవి వెసెల్ ప్లేట్స్ కేంద్రం, ఇంకా యితర భారీ పరిశ్రమలు ఈ పట్టణ ప్రాముఖ్యతను ఇనుమడింప చేస్తున్నాయి. విశాఖపట్టణంలో ఉక్కు కర్మాగార నిర్మాణం పూర్తి అయినపుడు భారతదేశ పారిశ్రామిక చిత్రపటంలో సముద్ర తీరంలో వెలసివున్న ఈ నగరానికి ప్రధాన స్థానం ఏర్పడుతుంది.

క్రీ.పూ. సుమారు 2,000 ఏండ్లకు పూర్వం వైశాఖ అనే రాజు ఇక్కడ నివసించి వుండినందున, దీనికి విశాఖ పట్టణం అనే పేరు వచ్చింది. ఆంధ్రవంశానికి చెందిన ఒక రాజు యీస్థలంలో వైశాఖ పేరుతో ఒక దేవాలయం నిర్మించినాడని స్థానిక ప్రజల విశ్వాసం. విశాఖపట్టణం వేంగిరాజులు, గంగులు, శాతవాహనులు చోళులు, కుతుబ్‌షాహి రాజులు, నిజాము పరిపాలనల క్రింద వుండింది. ఆ తరువాత ఇది బ్రిటీష్ వారి పరిపాలనక్రింద వచ్చింది. గోలకొండ రాజుల కాలంలో డచ్, ఇంగ్లీషు, ఫ్రెన్చి దేశాల వ్యాపారస్థులు ఈ ప్రాంతాలలో వాణిజ్యకేంద్రాలను ఏర్పాటు చేశారు. నిజాం కాలంలో ఈ ప్రాంతం బ్రిటీషువారి హస్తగతమైంది. అల్లూరి సీతారామరాజు నాయకత్వం క్రింద ఈ జిల్లా ప్రజలు విజృంభించి బ్రిటీష్ వారిపై తిరుగుబాటు లేవదీసిన సంఘటనను చరిత్ర చాటి చెబుతున్నది.

డాల్ఫిన్స్‌నోస్ నుంచి చూచినట్టయితే లాసన్స్‌బే కన్నుల పండువుగా వుంటుంది. ఇక్కడినుంచి పట్టణ దృశ్యమంతా కనిపిస్తుంది. డాల్ఫిన్స్‌నోస్ ఎత్తు 457 మీటర్లు వుంది. 7 మిలియన్ల కాండిల్స్ శక్తి, 40 మైళ్ల వెలుతురు పరిధిగల లైట్ హౌస్ ప్రపంచంలోని పెద్ద లైట్ హౌస్‌లలో ఒకటని భావించబడుతున్నది. ఈతగాండ్లకు స్వర్గతుల్యమైన లాసన్స్‌బే, సముద్ర స్నానం చేయదలచుకొన్నవారికి చాల ఆదర్శవంతమైన స్థలం.

విశాఖపట్టణాన్ని చూడదలచినవ్యక్తి భీముని పట్టణాన్ని తప్పకుండా దర్శించాలి. అసమాన సౌందర్యంగల సముద్రతీరానికి ఇది ప్రసిద్ధి పొందింది. ఇక్కడి సముద్రం చాలా మనోహరమైంది.

విశాఖపటణానికి సుమారు 10 కి. మీ. దూరంలో సింహాచలం వుంది. ఇది సముద్రమట్టానికి 800 అడుగులఎత్తున వుంది. ఇక్కడ శ్రీ నరసింహస్వామి దేవాలయం వెలసి వుంది. ఈ దేవాలయ శిల్పకళ కొనియాడదగినది.

అరకులోయ సముద్రమట్టానికి 3300 అడుగుల ఎత్తున ఉంది. ఈ లోయ విశాఖపట్టణానికి 30 కి. మీ. దూరంలో వుంది. యాత్రికులకు స్వర్గం వంటిది. యాత్రికులు గిరిజన సాంస్కృతిని పరిశీలించడం మాత్రమే కాకుండా దట్టమైన జంతు వృక్షసంపదను కూడా తిలకించవచ్చు. ఇక్కడ సహజమైన ప్రకృత వాతావరణంలో గిరిజన నృత్య ప్రదర్శనలు చూడడానికి చక్కని అవకాశాలున్నాయి. ఈ జిల్లాలో సున్నంరాయికి ప్రసిద్ధి పొందిన బుర్రా గుహలు కూడా చూడదగినవి.

విశాఖపట్టణానికి యాత్రికులను ఆకర్షించు ఉద్దేశంతో రాష్ట్ర ప్రభుత్వ యాత్రిక విషయాల శాఖ ఈ జిల్లాలోని యాత్రా కేంద్రాలను అభివృద్ధి పరచి ఆధునిక సౌకర్యాలు కల్పించేందుకు అనేక చర్యలు తీసుకొంటున్నది. యాత్రికులకు కావలసిన సమాచారం అందజేయడానికి ఇక్కడ ప్రాంతీయ యాత్రిక విషయాల సమాచారశాఖ ఒకటి తెరువబడింది. సింహాచలంలో యాత్రికులకు వసతి గృహం నిర్మించబడింది. అరకులో కూడా యాత్రిక విశ్రాంతి గృహాన్ని నిర్మించడానికి ప్రతిపాదనలు ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి. లాసన్స్ బేను అభివృద్ధి పరచి సముద్ర స్నానం చేయువారికి ఇతోధిక సౌకర్యాలు కల్పించడానికి ఈ శాఖ తీవ్రంగా ఆలోచిస్తున్నది. యాత్రికుల సౌకర్యార్థం విశాఖపట్టణంలో రోజూ దర్శనీయ స్థలాలను చూడడానికి, ఆదివారాలనాడు అరకులోయకు, చిన్న డీలక్సు బస్సులు నడపడానికి ఈ శాఖ తగిన ఏర్పాట్లు చేసింది.

సుమారు 200 ఏండ్ల క్రిందట విశాఖపట్టణం బెస్తల గ్రామంగా వుండింది. ఆకాలంలో ఈ గ్రామ జనాభాకూడా కొన్ని వందలు మాత్రమే వుండింది. అయితే ఇది ఇప్పుడు అభివృద్ధి చెందుతున్న పట్టణంగా రూపొందుతున్నది. ఇప్పుడు దీని జనాభా 2 లక్షలు. దేశాన్ని ఆర్థికంగా పటిష్టం చేసే విషయంలో ఈ పట్టణం ప్రముఖ పాత్ర వహించగలదు.









## విశాఖపట్టణం ఉక్కు ఫ్యాక్టరీ

# నూతన శకానికి నాంది



1, 2, 3 చిత్రాలు

జనవరి 2 'వ తేదీన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీకి విశాఖపట్నంలో ఘనస్వాగతం

4, 5 చిత్రాలు

ఉక్కు ఫ్యాక్టరీ పనికి ప్రారంభోత్సవం చేసిన తరువాత ప్రధానమంత్రి బహిరంగ సభలో ప్రసంగించారు.

6వ చిత్రం

ఫ్యాక్టరీ స్థలంవద్ద ప్రధానమంత్రి ఆవిష్కరించిన 68 అడుగుల ఎత్తుగల ఉక్కు పైలాన్ ఆంధ్రప్రదేశ్‌లో నూతన శకానికి నాంది పలికిన ప్రజల దృఢ సంకల్ప దీక్షా చిహ్నం.



# విశాఖ పట్టణంలో శ్రీమతి ఇందిరా గాంధీ : ప్రముఖులతో పరిచయాలు



విశాఖ పట్టణంలో ఉక్కు కర్మాగారం పనికి ప్రారంభోత్సవం చేయడానికి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ జనవరి 20వ తేదీన విశాఖపట్టణానికి











వచ్చిన సందర్భంగా రాష్ట్ర, స్థానిక ప్రముఖులను ముఖ్యమంత్రి ఆమెకు పరిచయం చేశారు. దీనిలో రాష్ట్ర ఉప ముఖ్యమంత్రి, రాష్ట్ర మంత్రులు, శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, వావిలాల గోపాల కృష్ణయ్య ప్రభృతులు వున్నారు.

# నా జీవితానుభవాలు

చెప్పినది : కీ. శే. కోలవెన్ను రామకోటేశ్వర రావు

నేను గుంటూర్లో టౌన్ హైస్కూల్లో చేరాను. చాలా రోజుల క్రితం యీస్కూల్లోనే మా నాన్నగారు ఉపాధ్యాయులుగా పని చేశారు కాబట్టి, మిషన్ వాళ్ళు నడుపుతున్న కాలేజీ హైస్కూల్లో చేరక, యీ టౌన్ హైస్కూలులో చేరడం జరిగింది. మాకుటుంబానికి సన్నిహిత పరిచితులైన పత్రి శ్రీనివాసరావు గారిని, కొండా వెంకటప్పయ్య పంతులు గారిని, అప్పు డప్పుడు కలుసుకొంటూ వుండే వాడిని. అప్పట్లో మా హెడ్మాష్టర్ కె. కె. కృష్ణయ్యర్ గారు హైస్కూలు తరగతులకు ఆయన ఇంగ్లీషు చెపుతుండేవారు. ఆ రోజుల్లో తెలుగు దేశమంతటాకూడా ఉపాధ్యాయులుగా తమిళులు ఎక్కువ మంది వుండేవారు. విద్యార్థులలో విద్యావిషయకంగా ఉన్నతమైన ప్రమాణాలు నెలకొల్పటానికి, వారిని శిక్షితులనుగా తీర్చి దిద్దటానికి యీ ఉపాధ్యాయులు చాలా అభినివేశం చూపేవారు. తరవాత తరవాత తమిళులంటే నాకు అత్యంతాభిమానం కలగటానికి, విద్యార్థి దశలోనే నాకు వారి యెడల కలిగిన పూజ్యభావమూ, మెచ్చుకోలూ ప్రాతిపదికలు కావచ్చును. చెన్నపట్నం చేరిన తరవాత నాలో యీ మెప్పు ప్రగాఢ తరమైంది. ఆ హైస్కూలు తరగతులలో నడింపల్లి నరసింహారావు, అన్నంరాజు సీతాపతిరావు, జూలూరి జయరాం పంతులు, నాతో సహ పాఠులుగా వుండేవారు. ఆ రోజుల్లోనే మిషన్ కాలేజీలో అక్కిరాజు ఉమా కాంతంగారూ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారూ, విజమూరి రంగాచార్యులు గారూ చదువు కుంటూవుండేవారు. వీరందరితో నాకు మంచి పరిచయం వుండేది.

హైస్కూలు తరగతులలో కూడా ఇంగ్లీషు, తెలుగు, హిష్టరీలే నా కభిమాన విషయాలు. లెక్కల విషయం చిన్న క్లాసుల్లో మాదిరి గానే వుండేది. ఆ రోజుల్లో బోధనా, పరీక్ష వ్రాయటమూ, అంతా ఇంగ్లీషే. అన్ని విషయాలూ ఇంగ్లీషులోనే చదువు కోవటమూ, ప్రశ్నపత్రికలకు సమాధానాలు వ్రాయటమూ కూడా జరిగేది. సుప్రసిద్ధ విద్వాంసులైన శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు ఆ రోజుల్లో మాస్కూల్లో సంస్కృత పండితులుగా వుండేవారు. మా తెలుగు పండితులు శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి గారు. వీరు తెలుగులో మాకు చక్కని అభిరుచిని కలిగించారు. వినసొంపైన కంఠస్వరం వీరిది, చక్కగా పాఠాలు చెప్పేవారు.

భారత, రామాయణాలు పాఠ్యభాగాల్లో వుండేవి. నాకు భాగవతంలో ప్రహ్లాద చరిత్రం, గజేంద్ర మోక్షం రుక్మిణీ కళ్యాణం చాలా అభిమాన పాత్రలుగా వుండేవి. చిలకమర్తి వారి నవలలు, వీరేశలింగంగారి ప్రహసనాలు, రాజశేఖర చరిత్రం, అప్పుడు నేను అభిమానంగా చదివిన గ్రంథాలు. అప్పుడప్పుడు హైస్కూలుతరగతులలో వక్తృత్వపు పోటీలు జరుగుతూ వుండేవి. తెలుగులోను, ఇంగ్లీషులోను వక్తృత్వపు పోటీలలో నేను పాల్గొనేవాణ్ణి. కొన్ని బహుమానాలు కూడా, యీ వక్తృత్వపు పోటీల సందర్భంగా గెల్చుకొన్నాను. ప్రతి సంవత్సరమూ మంచి మార్కులతో కృతార్థుణ్ణవుతున్నందువల్ల కూడా బహుమానలు వచ్చేవి. ఒక సంవత్సరం రానాడేగారి 'రైజ్ ఆఫ్ మరాఠా పవర్' మాక్సు ముల్లర్‌గారి 'లైఫ్ అండ్ టీచింగ్స్ ఆఫ్ రామకృష్ణా' అనే గ్రంథాలు బహుమతిగా వచ్చాయి. ఈ గ్రంథాలను చాల ఆసక్తితో చదివాను. ఎంతగానో ఆకర్షించాయి ఇవి నన్ను. ఇలాంటి పుస్తకాలు బహుమానాలుగా రావటం, వీటిని చదవటం, వొక దివ్యానుభూతిగా వుండేది. హై స్కూలు వార్షికోత్సవాలలోను, ఇంకా ఇతర సందర్భాలలోను నాటకాల్లో చిన్న చిన్న వేషాలు వేయటం, డైలాగ్సు చెప్పటం చేసే వాణ్ణి.

నేను మెట్రిక్యులేషన్ క్లాసులో చదువుతుండగా, ఉత్తర సర్కార్ల విద్యార్థుల మహాసభ గుంటూర్లో జరిగింది. ఆ సభకు పత్రి శ్రీనివాసరావుగారు అధ్యక్షత వహించారు. ఆ సభల సందర్భంగా నిర్వహించినవక్తృత్వపు పోటీలో నేను పాల్గొన్నాను. ఇంగ్లీషు వక్తృత్వానికి నాకే ప్రథమ బహుమతి వచ్చింది. ఆవాళ నదుల ప్రాముఖ్యాన్ని గూర్చి మాట్లాడాను. ఈ బహుమానం పొందడం వల్ల నాలో ఒక ఉత్సాహం, ఆత్మ విశ్వాసం వెల్లి విరిశాయి. ఆ రోజుల్లో క్రికెట్ ఆడటం పట్ల కొంత ఆసక్తి చూపే వాణ్ణి. ఉపాధ్యాయులతో చాలా చనువుగా మెసలేవాణ్ణి. గోపరాజు కృష్ణారావు నాకు ఆప్త మిత్రుడు. కలిసి మెలసి వుండే వాళ్ళం. ఈ కృష్ణారావు తరువాత పై చదువులకు ఇంగ్లండు వెళ్ళి, గోల్ఫ్ ఆటగాడుగా విశేషమైన ప్రసిద్ధిని పొంది, తిరిగి వచ్చేటప్పుడు బొంబాయిలో అకాల మృత్యువు వాతపడ్డాడు. నా కన్నా పై క్లాసు చదువుతున్న మొరసుపల్లి కృష్ణారావు నా పట్ల విశేషమైన నెనరు చూపుతూ వుండేవాడు. నా చేత పుస్తకాలు చదివించి, వ్యాసాలు వ్రాయించి, ఆ వ్యాసాలు దిద్దీ, చాల ప్రోత్సహిస్తూ వుండేవాడు. ఇతడి దగ్గర నిషేధం పొందిన రాజకీయ కరపత్రాలు కూడా వుండేవి వాటిని రహస్యంగా చదువుతూ వుండేవాణ్ణి సాయంకాలం పూట రోజూ బాడ్‌మింటన్ ఆడటమో, లేదా కబుర్లు చెప్పుకుంటూ, స్నేహితులతో షికార్లు వెళ్ళటమో చేసేవాణ్ణి.

మొరసుపల్లి కృష్ణారావు కూడా ఇంగ్లండు వెళ్ళి ఇంజనీరై మైసూరు రాష్ట్రంలో ఉద్యోగం చేశాడు. శిరం సుబ్బారావ

డా. అక్కిరాజు రమాపతిరావు

ఇంకో స్నేహితుడు ఆ రోజుల్లో ఫస్టకంపెనీ వారి చిరకారి నాటకం ద్వారా చాలా ప్రసిద్ధుడు.

అప్పటికే రాజకీయమైన చైతన్యం దేశాన్ని చాలా ప్రభావితం చేసింది. 1908 వ సంవత్సరంలో తిలక్‌కు జైలుశిక్ష పడినప్పుడు, విద్యార్థులమంతా నిరసనగా స్కూలుకు వెళ్ళకుండా ఊరేగింపు జరిపాము. ఆ సందడిలో రెండునెలలు స్కూలు జీతానికి సరిపడే మొత్తం నాజేబునుంచి జారిపోయింది. ఈ విషయం మా నాన్నగారు విన్నప్పుడు మందలించక పోగా, ఆ ఊరేగింపులో నేను పాల్గొన్నందుకు చాలా సంతోష పడ్డారు. ఇంతకు పూర్వమే లాలాలజపతిరాయ్‌కి ప్రవాస శిక్ష విధించి నప్పుడు, మెయిల్ పత్రికను బహిష్కరించే ఉద్యమాన్ని విద్యార్థులం లేవదీశాము. అప్పటి రోజుల్లో భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం రావాలనీ స్వరాజ్యం మా జన్మ హక్కని, ఉద్ఘాటించే మహానాయకుల వాణి, విద్యార్థులను అమితంగా ఆకర్షించింది. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యమే మాజీవిత లక్ష్యమన్న నినాదం మమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేసేది. ఎప్పటికైనా యీ మనోరథం సిద్ధిస్తుందా, యీ నినాదం ఫలిస్తుందా, యీ ఆశయం నెరవేరుతుందా అని తహతహ కలిగేది. ఆంగ్లేయులు ఎప్పుడు ఈ దేశాన్ని విడిచిపెట్టిపోతారు అన్న ఆక్రోశం ఉద్రేకం, మనసునిండి వుండేవి. వంగదేశ విభజన ఫలితంగా వచ్చిన విప్లవోద్యమం, అరవింద ఘోష్ నడిపిన వందేమాతరం పత్రికా, ఆరోజుల్లో గొప్ప చైతన్యాన్ని, సంచలనాన్ని కలుగచేశాయి.

అప్పుడే గాడిచెర్ల హరి సర్వోత్తమ రావుగారు బెజవాడలో తెలుగు స్వరాజ్య పత్రికను నడపటం, జైలుకు వెళ్ళటం, ఆ వార్తలు చాలా ఉద్రేకాన్ని కలిగించేవి. 1908 వ సంవత్సరంలో మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థుడైనాను. తరువాత ఇంటర్‌మీడియట్ చదివేందుకు బందరు చేరి, 1909 లో నోబుల్ కాలేజిలో చేరాను. అప్పటివరకూ సంవత్సరాంతం పరీక్షలు డిసెంబరులో జరిగేవి. ఆ సంవత్సరమే మార్పు చెందాయి. నోబుల్ కాలేజికి అప్పుడు 'పెన్' అనే ఆయన ప్రిన్స్‌పాల్‌గా వుండేవారు. చెన్నాప్రగడ భానుమూర్తిగారు లెక్కల ప్రొఫెసరుగా వుండేవారు. ఈయనగారు తెలుగు కాంపోజిషన్ క్లాసులు తీసుకొనే వారు. వీరు క్లాసుల్లో తరచూ తాము రచించిన పద్యాలూ, ప్రాచీన కావ్యాల నుంచి పద్యాలూ, శ్రవణపేయంగా, ఆసక్తిదాయకగా చదువుతూ వుండేవారు. చాలా ఉత్సాహ భరితంగా వుండేవి ఆ పద్యాలు. వీరి క్లాసుల వలన తెలుగులో మంచి అభిరుచి కలిగేందుకు ఆస్కారం కలిగింది. ఈ కాలంలోనే హిందూ హైస్కూలులో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, తెలుగు పంతులుగా పనిచేసేవారు. వీరి ఉపన్యాసాలూ, శతావధానాలు చాలా ఉత్సాహాన్ని ఆసక్తినీ రేకెత్తించేవి. ఆరోజుల్లోనే బుట్టయ్యపేట నాటకశాలలో దేశభక్తిని ఉద్దీపింప జేసే నాటకాలను, ఈమని లక్ష్మణ స్వామిగారు ప్రదర్శింపజేస్తూ ఉండేవారు. చిత్రమేమిటంటే యీ నాటకాలు హిందీలో వున్నా బాగా ఆకర్షించేవి. ఆ రోజులలో వారణాసి శ్రీనివాసరావు గుదిమెళ్ళ వరదాచార్యులు, కోరాడ రామకృష్ణయ్యగారలు నాకు సహపాఠులు. ఆ కాలంలోనే పింగళి లక్ష్మీకాంతంగారు హిందూ హైస్కూలులో మెట్రిక్ చదువుతూ వుండేవారు. అందువల్ల వారితో నాకు పరిచయం వుండేది. ఆటు తరువాత వారణాసి శ్రీనివాసరావు హిందూకాలేజి ప్రిన్సిపాల్ అయినారు.

అప్పుడే ఆంధ్రజాతీయ కళాశాల స్థాపన జరగటం, ఒక ఉత్తేజకరమైన సంఘటన. ఈ వాతావరణం, సభలూ సమావేశాలూ, చైతన్యం ఆ రోజుల్లో విద్యార్థులను ఉత్తేజితులను గాను, ఉత్సాహ ప్రపూరితులనుగానూ చేశాయి. ఈ కాలంలోనే పట్టాభి సీతారామయ్యగారితో మొట్టమొదటి సారిగా నాకు పరిచయం కలిగింది. పదాదిగా వారు నాయందెంతో వాత్సల్యాని, అభిమానాన్ని చూపుతుండేవారు. కరుగంటి సీతరామయ్యగారు, అబ్బూరి రామకృష్ణారావుగారు, అప్పుడక్కడ చదువుతూ వుండేవాళ్ళు విశేషించి స్నేహం లేకపోయినా, పరిచయం బాగా వుండేది. కోపల్లె హనుమంతరావుగారితోనూ, ముట్నూరి కృష్ణారావుగారితోను అట్టే పరిచయం లేకపోయినా అక్కడక్కడ సభల్లోనూ సమావేశాల్లోనూ వారిని దర్శిస్తూవుండే వాణ్ణి. ఆంధ్రదేశానికి ఆ రోజుల్లో బందరే సాంస్కృతిక రాజధాని అనీ, ముందు ముందు రాజకీయంగా కూడా నాయకత్వం వహించగల పట్టణం అదేననీ, చాలా అతిశయంగా, ఆనందంగా, ఘనంగా ఉండేది బందరును తలుచుకొంటే, బందరంటే అప్పటినుంచిన్నీ విశేషాభిమానమే. మా బంధువులు కూడా ఎక్కువగా బందరులోనే వుండేవాళ్ళు. బందరులోవున్న రోజుల్లో నేను, మా అమ్మగారూ, బంధువులింట్లోనే అద్దెకుండే వాళ్ళం. 1909వ సంవత్సరంలో బందరుకు బెజవాడ నుంచి రైలు మార్గం వచ్చింది. అప్పటి దాకా కాలవలో పడవలమీదా, ఎండాకాలంలో రెండెడ్ల బండిమీదా, బెజవాడనుంచి బందరుకు ప్రయాణంచేసే వాళ్ళం. ఆ ప్రయాణాలుకూడా చాలా సరదాగా వుండేవి. ప్రిన్సిపాల్ 'పెన్' ఇంగ్లీషు, హిష్టరీ బోధించే వారు. ఇంటర్‌లో నాకు హిష్టరీ, లాజిక్ అభిమాన విషయాలుగావుండేవి. ఆస్ట్రేలియా దేశస్థుడైన క్రాన్స్‌విక్ అనే ప్రొఫెసరు ఇంగ్లీషు బాగాచెప్పేవారు. దుగ్గిరాల రామమూర్తిగారు చాలా ప్రతిభావంతులైన ఇంగ్లీషు ప్రొఫెసరుగా విద్యార్థులకు ప్రీతిపాత్రులుగా వుండేవారు. ఆ రోజుల్లోనే ఇంగ్లీషులో వక్తృత్వానికి సంబంధించిన కొంత ప్రాగల్భ్యం సంపాదించాను. ముఖ్యంగా పట్టాభిగారి ఇంగ్లీషు ఉపన్యాసాలు నన్ను అమితంగా ఆకర్షించి ముగ్ధుడ్ని చేసేవి. విద్యార్థులకు దుగ్గిరాల రామమూర్తిగారూ, చెన్నాప్రెగడ భానుమూర్తిగారూ, అత్యంత ప్రేమాస్పదులుగా వుండేవాళ్ళు. అనంతరామయ్యగారని హిష్టరీ ప్రొఫెసరు, నాయందు విశేషమైన అభిమానాన్నీ ఆత్మీయతను చూపేవారు. వారికి నాపట్ల ప్రత్యేకమైన అభిమానముండేది. ఇంటర్‌మీడియట్ పరీక్ష ప్రథమ తరగతిలో ఒక విశిష్టమైన స్థానాన్ని సంపాదించి కృతార్థుడైనాను. అంధ్రులందరిలోనూ ప్రథమగణ్యతను సంపాదించటమే ఆవిశిష్టత. ఆంధ్రదేశం నుంచి పరీక్షార్థులైన వారందరిలోనూ ప్రథముణ్ణిగా ఉత్తీర్ణుణ్ణి కావటం, నాకు కొంత అతిశయాన్నీ, ఉత్సాహాన్నీ కలిగించకపోలేదు. అప్పుడు దక్షిణాదికంతకూ మద్రాసు విశ్వవిద్యాలయం మాత్రమేవుండేది. ఆంధ

కర్ణాటక, తమిళ, మలయాళ ప్రాంతాలనుండి పరీక్షకు వచ్చినవాళ్ళలో ఆంధ్రదేశం నుండి ప్రప్రథముణ్ణిగా నేను ఉత్తీర్ణుణ్ణి కావటం ఘనమే ననుకున్నాను. అప్పటికి నావయస్సు పదిహేడు సంవత్సరాలు. బందరులో ఇంటర్మీడియట్ పూర్తి చేసిన తరువాత, చెన్నపట్నం వెళ్లి ప్రెసిడెన్సీ కాలేజీలో బి.ఏ. ఆనర్సులో ప్రవేశించాను. ఈ సారి మాత్రం మా అమ్మగారు నాతోరాలేదు. నేను ఒక్కణ్ణె చెన్నపట్నం వెళ్ళి హాస్టల్లో చేరాను. కాని మూడు నాలుగు నెలలు చదువుకొనసాగింది. ఆరోగ్యం సరిగా లేనందువలన ఆ ఏడు చదువు మానుకొని ఇంటికి విశ్రాంతి ననుభవించి తరువాత సంవత్సరం మళ్ళీ ప్రెసిడెన్సీ కాలేజీలో బి. ఏ. లో చేరాను. అప్పుడు విక్టోరియా హాస్టల్లో వుండేవాణ్ణి. ఎందుకలా జరిగిందో కాని మరి, చదువుమీద గాఢమైన శ్రద్ధ కాస్తా సన్నగిల్లి బి. ఏ. పరీక్షలో కృతార్థుణ్ణి కాలేకపోయాను. అదిన్నీ ఏహిస్టరీలో నైతే మంచి అభిరుచి ఉండేదో ఆ హిస్టరీలోనే తప్పిపోవటం. మానసికంగా నన్ను చాలా కృంగతీసిందనే చెప్పాలి. చాలా సిగ్గుకలిగింది. గొప్ప ఆశాభంగం పొందాను. ఇంటికి తిరిగివచ్చి మరునటి సంవత్సరం, బందరు వెళ్ళి బి. ఏ. లో చేరి, ఆ తప్పిపోయిన భాగాన్ని పూర్తి చేశాను. మళ్ళీ మద్రాసు వచ్చి బి. ఏ. లో చేరి, చదువు సంధ్యల్లోనూ స్నేహితులతోనూ, ఆత్మీయతా భావం పెంపొందించుకున్న దాకా, వెనుకటి పరాజయ భారం వెన్నంటి మనస్సును కలత పెడుతూనే వుండేది. అయితే ఒకటి మాత్రం నిజం. నేను మద్రాసులో చదువుకున్న రోజులు చాలా ఉత్సాహంగానూ, సంతోషంగానూ గడిచిపోయినయి. తారుణ్యమూ ఉద్వేగమూ ముగ్ధత్వమూ, జీవితాన్ని ఆనంద ప్రపూర్ణం చేసేవి. ఆరోజుల్లో కె. యస్. వెంకటరమణి నాకు ప్రాణ స్నేహితుడు. వీరిని నేనెన్నటికి మరచిపోలేను. ఈయన ఇంగ్లీషులో చాలా గొప్ప రచయితగా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు తరువాత. వీరప్పుడు క్రిస్టియన్ కాలేజీలో చదువుకుంటూవున్నా, మాతోపాటే విక్టోరియా హాస్టల్లో వుంటూవుండేవారు. ఈ రోజుల్లోనే ఎన్. రఘునాథన్‌తో సన్నిహితమైన స్నేహం కలిగింది. వీరు, తరువాత 'హిందూ' పత్రికలో సహాయ సంపాదకులైనారు. ఈ నాస్నేహితులంటే నాకు చాలా ప్రేమాభిమానాలూ గౌరవాదరాలూ వుండేవి. అప్పుడు మా ప్రెసిడెన్సీ కాలేజీ ప్రిన్సిపాల్ మిడిల్ మాస్టర్. ఇంగ్లీష్ ప్రొఫెసరైన మార్క్- హంటర్, మేకింటోష్, సామ్యూల్ రంగనాథన్ ఇంగ్లీషు అద్భుతంగా బోధించే వారు. హిస్టరీకి 'ఎలెన్'అనే ప్రొఫెసర్ వచ్చేవారు. ఇదంతా నేను బి.ఏ. చదివే రోజుల సంగతన్న మాట. వాళ్ళ బోధనా కౌశలంగానీ, పాండిత్య గరిమ గానీ అద్భుతాలుగా వుండేవి. అంత గొప్పగా వారు బోధించేవారు కాబట్టి, సాహిత్యం చరిత్ర, సారస్వత విమర్శ మొదలైన విషయాల్లో గాఢ శీలమైన అభిరుచీ, అభినివేశమూ, విద్యార్థుల్లో కలిగేవి. చాలా గొప్ప స్థాయిలో నాటి ఆచార్యులు బోధించేవారు. ఆ రోజుల్లో, కేట్సు, షెల్లీ, వర్డ్సు వర్త్, మొదలైన కవీశ్వరుల సాహిత్య రీతులను, ఆసక్తికరంగా అధ్యయనం చేసేవారు విద్యార్థులు. ఈ హేతువు వల్లనే ఏమో, తెలుగు కవిత్వంలో నూతనోద్యమం అప్పుడే బయలుదేరింది. బసవరాజు అప్పారావు, అధికార్ల సూర్యనారాయణ, తణికెళ వీరభద్రుడు, తెన్నేటి విశ్వనాథం అప్పుడక్కడ హాస్టల్లో వుండేవారు. ఆంధ్ర దేశపు నలు మూలలనుంచీ ప్రతిభావంతులైన విద్యార్థులు వచ్చి చెన్నపట్నంలో విద్య నభ్యసించేవారా రోజుల్లో. వెంకట మా నరసారావుపేటలో డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌గా పని చేసిన నాభి రామమూర్తి పంతులుగారి కొమారులు, నా బాల్య స్నేహితులైన జగన్నాథరావు, రామకృష్ణారావులతో, మళ్ళీ నాకు చెన్నపట్నంలో సాన్నిహిత్యం ఏర్పడింది. అప్పటికి నాభివారు బరంపురం చేరుకొని అక్కడ స్థిరపడ్డారు. నేను మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుకొనే రోజుల్లో జరిగిన వొక చిన్న విషయం జ్ఞాపకం వస్తున్నది. నేను వ్రాసిన కాంపోజిషన్ ఒక దానిని ప్రొఫెసర్ సామ్యూల్ రంగనాథన్ అమితంగా మెచ్చుకుంటూ పేరు చెప్పకుండా, "ఇటువంటి వ్యాసం మౌలికంగా యీ విద్యార్థే వ్రాసివుంటే, చాలా గొప్ప విషయం అని చెప్పాలి. ఎక్కడ నుంచైనా సంగ్రహించి వుంటేచెప్పలేం కాని. స్వయంగా ఇలాంటి వ్యాసమే వ్రాయగలిగివుంటే, ఈ విద్యార్థిలో మెకాలే, కార్లైల్ మొదలైన మహనీయుల శైలీప్రాగల్భ్యం రూపు రేఖలు దిద్దుకొంటున్నదనీ, వారి ప్రతిభ యీ విద్యార్థిలో మొగ్గ తొడుగుతున్నదనీ చెప్పటానికి ఏమీ సందేహంలేదు." అని మెచ్చుకొన్నారు క్లాసులో. అప్పటికి నేను ఇంగ్లీషులో ఉపన్యసించటంలోనూ, వ్రాయటంలోను కొంత ప్రజ్ఞ సంపాదించాను అని చెప్పటమే యీపై సంఘటనను గుర్తు చేసు కొనడంలోని పరమోద్దేశం.

—

ఆ రోజుల్లో వేదం వెంకట్రాయ శాస్త్రిగారు, క్రిస్టియన్ కాలేజీలో సంస్కృత పండితులుగా వుండేవారు. మా ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు పండితులుగా ఆంధ్ర వాల్మీకి వావిలి కొలను సుబ్బారావు పంతులుగారుండేవారు. వీరే తరువాత వాసుదాసుగారుగా విఖ్యాతులైనారు. ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృత పండితులుగా అప్పుడు రంగాచార్యులు గారున్నారు. ఆ తరువాత కొద్ది రోజులకే కుప్పుస్వామి శాస్త్రిగారు స్థానాన్నలంకరించారు. కురుగంటి సీతారామయ్యగారూ, గుదిమెళ్ళ వరదాచార్యుల సంస్కృతం ఆనర్సు చదువుతూ వుండే వారప్పుడు. బసవరాజు అప్పారావు వచ్చి, వొక రోజున తనను తాను నాకు పరిచయం చేసు కున్నాడు. యూనివర్సిటీ పరీక్షలో క్రితంసారి నేను సాధించిన గణ్యతనే ఆ తరువాత అతడు సాధించినట్లు చెప్పకుంటూ, నా పరిచయం చేసుకున్నాడు. తరువాత సన్నిహితంగా స్నేహితులమైనాము.

ఈ రోజుల్లో రాయప్రోలు సుబ్బారావుగారితో మంచి పరిచయమే వుండేది. అప్పుడాయన మద్రాసులోనే వుండేవారు. చెన్నాప్రగడ భానుమూర్తిగారి వద్ద సాహిత్య వ్యాసంగం చేస్తూ, కొమర్రాజు విజ్ఞాన సర్వస్వంలో చేరి అంటే 1914 లో రాయప్రోలు 'తృణ కంకణం' ప్రకటించారు. అప్పటికింకా ఆయన శాంతి నికేతన్ వెళ్ళలేదు. రాయప్రోలు సుబ్బారావుగారితో, నాకిదివరలోనే పరిచయం వుంది. గుంటూరులో బందరులో చదువుకునే రోజులలోనే వీరితో పరిచయం వుండేది. మొట్ట మొదటిసారిగా వీరిని విగా మా నరసారావుపేటలోనే చూశాను.

(సశేషం)

# శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

— ఎం. చంద్రశేఖరయ్య

దక్షిణాదిలో పవిత్ర సప్త గిరుల చల్లని
ఛాయలలో వెలసిన శ్రీ వెంకటేశ్వర
విశ్వవిద్యాలయం పుట్టుపూర్వోత్తరాలు

రాయలసీమ, నెల్లూరు ప్రాంత వాసుల ఉన్నత విద్యా సముపార్జన సహజ కోరికను తీర్చే ఉద్దేశంతో 1954 సెప్టెంబరులో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేశారు. చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు, ఒంగోలు కొంత భాగం జిల్లాలు యీ విశ్వవిద్యాలయం పరిధిలో ఉన్నాయి. ఏడు కొండల వాడైన శ్రీ వెంకటేశ్వరుని ఆశీస్సులతో యిది నిర్వహించ బడుతున్నది. ఈ విశ్వవిద్యాలయం ప్రథమ సెనెటు, ప్రథమ అకడమిక్ కౌన్సిల్ 1955 జూన్‌లో ఏర్పాటైనాయి. అదే సంవత్సరంలో బోర్డు ఆఫ్ స్టడీస్, ఫ్యాకుల్టీలు ఏర్పాటు అయినాయి.

## ఇతోధిక విరాళాలు

ప్రారంభదశలో టి.టి. దేవస్థానంవారు రూ.40 లక్షల విలువ చేసే తమ ఆధీనములోని కళాశాలలు, హాస్టల్ భవనాలను యీ విశ్వవిద్యాలయం పరంచేశారు. అంతేగాక ప్రథమ సంవత్సరంలో రు. 6.5 లక్షల గ్రాంటు యిచ్చారు. ఈ విరాళాలకు తోడు 1000 ఎకరాల భూమి కూడ యిచ్చారు. వార్షికంగా యిస్తున్న రు. 2.5 లక్షల గ్రాంటును రు. 6 లక్షలకు పెంచారు. విశ్వవిద్యాలయం నిర్వహణకు అయ్యే ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం, విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘం భరిస్తాయి.

ప్రథమ ఉపాధ్యక్షులు శ్రీ గోవిందరాజులు, విశ్వవిద్యాలయం రూపు రేఖలను తీర్చిదిద్దడంలో ప్రముఖంగా కృషిచేశారు.

1964 లో డా॥ వి. సి. వామన్‌రావు ఉపాధ్యక్షులైనారు. ఆ తర్వాత ఐదు సంవత్సరాలలో అనుబంధ కళాశాలల సంఖ్య పెరిగింది. ప్రస్తుతం యీ విశ్వవిద్యాలయం ఆధీనంలో 40 కళాశాలలు ఉన్నాయి. అనుబంధ కళాశాలలో విద్యార్థుల సంఖ్య 35,745.

## పోస్ట్‌గ్రాడ్యుయేట్ కేంద్రం

విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘం, రాష్ట్ర ప్రభుత్వం ఆర్థిక సహాయంతో రు. 45 లక్షల ఖర్చుతో అనంతపురంలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ కేంద్రాన్ని ఏర్పాటుచేశారు. అనంతపురంలోని ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాలలోనే ప్రస్తుతము కేంద్రం నిర్వహించబడుతున్నది. అయితే యీ పట్టణానికి కొన్ని మైళ్ళ దూరంలో 450 ఎకరాల విశాలమైన స్థలంలోకి దీనిని త్వరలోనే మార్చడం జరుగుతుంది. ప్రాథమిక నిర్మాణం పథకాలు పూర్తి కావచ్చాయి.

1971 జూలై నాటికి ఇటికపల్లికి భారత విద్యాచిత్రపటంలో స్థానం లభిస్తుంది. 1968-69 విద్యా సంవత్సరం నుండి అనంతపురంలోని పోస్ట్ గ్రాడ్యుయేట్ కేంద్రం పని ప్రారంభించింది. గణితం, భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రం, ఇంగ్లీషు, తెలుగు కోర్సులను నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం 95 మంది విద్యార్థులు ఉన్నారు.

1969 ఆగస్టు 11న డా॥ డి. జగన్నాథరెడ్డి ఉపాధ్యక్షులుగా పదవి స్వీకరించారు. కొన్ని నెలలలోనే విశ్వవిద్యాలయం క్రొత్త రూపును సంతరించుకొంది. కామర్స్, రాజకీయ శాస్త్రం, తమిళం, న్యాయశాస్త్రం నాలుగు కొత్త కోర్సులను ప్రారంభించారు. మరి కొన్ని కోర్సులను ప్రవేశ పెట్టనున్నారు.

## విశ్వవిద్యాలయం కళాశాలల

1954 సెప్టెంబరులో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం కళాశాలను ప్రారంభించారు. ఐదు సంవత్సరాల కాలంలో యీ కళాశాలలో గణితం, భౌతికశాస్త్రం, రసాయనికశాస్త్రం, జంతు శాస్త్రం, అర్థశాస్త్రం, తత్వశాస్త్రాలలో ఆనర్సు కోర్సులను ఏర్పాటు చేశారు. 1959-60 విద్య సంవత్సరంలో బాటనీ, జియాలజీ, హోంసైన్స్, చరిత్ర, సైకాలజీ, ఇంగ్లీషు, తెలుగు, హిందీ, సంస్కృతం, ఉర్దు, పారసీలలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులను ప్రవేశపెట్టారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం కళా

శాలలో మొత్తం 395 మంది పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థులు ఉన్నారు. అదే సంవత్సరంలో ఆనర్స్ కోర్సును పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయికి పెంచారు.

అదే సంవత్సరంలో పి. హెచ్. డి. డాక్టరేట్ డిగ్రీ పరిశోధనా కార్యక్రమాన్ని ప్రవేశ పెట్టారు. విశ్వవిద్యాలయం కళాశాలలో బోధన, పరిశోధనలపై కృషిని కేంద్రీకరించారు 1960లో శ్రీ వెంకటేశ్వర వైద్య కళాశాలకు అనుబంధ స్థాయిని మంజూరు చేశారు. ఈ విశ్వవిద్యాలయంలో యిప్పుడు ఆర్ట్స్, సైన్స్ మెడిసిన్-ఇంజనీరింగ్. విద్య, కామర్స్, ప్రాచ్యభాషా అధ్యయనం, న్యాయశాస్త్రం పీఠాలు ఉన్నాయి.

## పరిశోధనకు ప్రోత్సాహం

పి. ఎల్. 480 పథకం క్రింద అమెరికా అందజేసిన రు. 2,24,600 ఆర్థిక సహాయంతోను, రాష్ట్ర వ్యవసాయ శాఖ సహాయంతోను, విశ్వవిద్యాలయం జూలాజికల్ శాఖ వారు. అనావృష్టికి గురయ్యే రాయలసీమ ప్రాంతంలో భౌతిక పరిస్థితుల గూర్చి ఐదు సంవత్సరాల పాటు కొనసాగే పరిశోధనా కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు.

కెనడా దేశం అందజేసిన 160 కెనెడియన్ డాలర్ల సహాయంతో హోంసైన్స్ శాఖ వారు పౌష్టిక ఆహార పరిశోధనా కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు.

భూగర్భ శాఖ వారు రాయలసీమలోని అనావృష్టి ప్రాంతాలలో భూగర్భ జలసంపదను గూర్చిన సర్వే జరుపుతున్నారు. రాయలసీమలో వ్యవసాయ క్షేత్రనిర్వహణ ఆర్థిక స్థితిగతులను గూర్చి పరిశీలన జరిపారు. 1960 నుండి కళాశాల ప్రణాళికా గోష్టి బృందం వారు గ్రామీణ సాంఘిక కార్యక్రమాలు, గ్రామీణ సర్వే కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. 1968లో సిడ్నీలో జరిగిన 10వ కామన్వెల్త్ విశ్వవిద్యాలయాల కాంగ్రెసుకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రతినిధిగా ప్రొఫెసరు ఎం. వి. రామశర్మ హాజరయ్యారు.

## ప్రాచ్యభాషా పరిశోధన

తిరుమల తిరుపతి దేవస్థానం వారు తమ ప్రాచీన వ్రాత ప్రతుల గ్రంథాలయాలతోకూడిన ప్రాచ్యభాషా పరిశోధన సంస్థను యీ విశ్వవిద్యాలయానికి బహూకరించారు. అంతేగాక శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యభాషా పరిశోధనా సంస్థ నిర్వహణకు రు. 62.5 లక్షల గ్రాములను మంజూరుచేశారు. రాష్ట్ర ప్రభుత్వంనుండి వార్షికంగా రు. 60,000ల గ్రాంటుకూడ యీ సంస్థకు లభిస్తున్నది. అపూర్వమైన ప్రాచీన పత్రాల వర్గీకరణ, అక్షర క్రమంలో నిర్వహణ మొదలైన పనులను యీ సంస్థ చేపట్టుతున్నది. అంతేగాక శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యభాషా పరిశోధన పత్రికనుకూడా నిర్వహిస్తున్నది. సంస్కృత భాషకు చెందిన 10,000 వ్రాత ప్రతులు, తెలుగులో 4,000, తమిళంలో 1,200, కొన్ని కన్నడభాషా ప్రాచీన వ్రాతప్రతులు యీ సంస్థవద్ద ఉన్నాయి.

## గ్రంథాలయ విస్తరణ

గత పదిహేను సంవత్సరాల కాలంలో యిక్కడి గ్రంథాలయాన్ని గణనీయ స్థాయిలో విస్తరింపజేశారు. విశాలమైన భవనంలో యీ గ్రంథాలయాన్ని ఏర్పాటుచేశారు. దాదాపు 1,20,000ల పుస్తకాలు ఉన్నాయి. దాదాపు 800 పత్రికలను యీ గ్రంథాలయం తెప్పిస్తున్నది. పుస్తకాలతో పాటు మైక్రోఫిల్ములు, మైక్రోకార్డు, తాళపత్ర గ్రంథాలు మొదలైనవి కూడ యీ గ్రంథాలయంలో ఉన్నాయి. దానికితోడు యునెస్కో కేంద్రంకూడ యిక్కడ పనిచేస్తున్నది. ఇటీవల ఫిల్ములైబ్రరీ, బాలల గ్రంథాలయాలను కూడా ఏర్పాటుచేశారు.

విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘం సహాయంతో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయ హాబీవర్క్‌షాపును కూడా ఏర్పాటు చేశారు. ఇక్కడ విద్యార్థులు ప్రతివారం కొన్ని గంటలు పాటు వడ్రంగం, కమ్మరం, ఫర్నీచర్ తయారీని నేర్చుకుంటారు. 1962లో విద్యా మంత్రిత్వశాఖ, విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘం సహాయంతో విద్యార్థుల ఆరోగ్య కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ కేంద్రంలో విద్యార్థులకు వైద్యసహాయం అందజేయబడుతున్నది. ఇటీవల మెడికల్ ఫ్యాకల్టీని బోధనేతర సిబ్బందికికూడా విస్తరింపజేశారు. ఎక్సరే యంత్ర పరికరాల కొనుగోలుకు కేంద్ర ఆరోగ్య శాఖా మంత్రి రు. 10,000 లు మంజూరు చేశారు. ప్రపంచ విశ్వవిద్యాలయ సర్వీసు, యీ విశ్వవిద్యాలయం రు 75,000 ల ఖర్చుతో ఒక కెమెరా కొనుగోలు చేయాలని నిర్ణయించాయి.

## ఉపాధి అవకాశాలు

1964లో విశ్వవిద్యాలయ ఉపాధి సమాచార, సలహా కేంద్రాన్ని నెలకొల్పారు. దుకాణాలు, ఫ్యాక్టరీలు, యితర సంస్థలలో ఉపాధి అవకాశాలనుగూర్చి యిక్కడ సలహాయిస్తుంటారు. విశ్వవిద్యాలయం పట్టభద్రుల తర్వాత కార్యక్రమాల గూర్చి, వారు సంపాదించే స్థాయిని గూర్చి కూడా యిక్కడ సలహా సహాయం అందజేయ బడుతుంది. యీ కేంద్రం వారు పక్ష పత్రికను నిర్వహిస్తున్నారు. జాతీయ కేడెట్ కోర్స్ నేషనల్ సర్వీసుకోర్స్, జాతీయ సమైక్యత్వాన్ని పెంపొందించుకోడంలో తోడ్పడుతున్నాయి.

విశ్వవిద్యాలయం ముద్రణాలయం వారు యింతవరకు ప్రాచ్యభాషాబోధనలో గ్రామీణ అభివృద్ధి, గణితం, ఆగ్నేయ ఆసియా చరిత్రకు సంబంధించి పదిపత్రికలను ప్రచురించారు. శ్రీ టి. ప్రకాశం, శ్రీ ఎస్. గోవిందరాజులు నాయుడు స్మృతి చిహ్నాల ఏర్పాటుకు రు. 84000 ల మొత్తాన్ని సేకరించారు. దానిలో వారిద్దరి పేర జరిపే ఉపన్యాసాల నిర్వహణకు రు 11000 ల మొత్తాన్ని కేటాయించారు. రెండు సంవత్సరాలకు ఒకమారు ప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్తను ఆహ్వానించి న్యాయశాస్త్రంలో ఉపన్యాసాలు నిర్వహించే కార్యక్రమాన్ని అమలు జరపాలని సిండికేటు నిర్ణయించింది. 1970 అక్టోబరులో పై యిద్దరు ప్రముఖుల విగ్రహాలను ప్రతిష్ఠింపజేశారు.





1



2



3

# నగరంలో....

1. భారత ఉపరాష్ట్రపతి జి. ఎస్. పాఠక్ జనవరి 1న హైదరాబాదు విచ్చేసినప్పుడు విమానాశ్రయంలో స్వాగతమిస్తున్న రాష్ట్ర గవర్నరు, ఉపముఖ్యమంత్రి.

2. ఉపరాష్ట్రపతి జనవరి 1న అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనకు, జ్యోతిని వెలిగించడం ద్వారా ప్రారంభోత్సవం చేస్తున్నదృశ్యం.

3. ఉపరాష్ట్రపతి 2వతేదీన ఢిల్లీకి తిరిగి వెళ్తున్నప్పుడు విమానాశ్రయంలో వీడ్కోలు చెప్తున్న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి.

4. రాష్ట్రగవర్నరు జనవరి 3వతేదీన బాలభవన్‌లో "గతచరిత్ర గాథలు" బొమ్మల ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు.

5. కేంద్రంలో. స్టేట్ విద్యామంత్రి శ్రీ భక్త దర్శన్ జనవరి 1న పబ్లిక్ స్కూల్లోని అంతర్ రాష్ట్రీయ విద్యార్థినులు, ఉపాధ్యాయుల జాతీయ సమైక్యతా శిబిరంలో ప్రసంగించారు.



4



5





7

# నగరంలో....



6. ఆంధ్రప్రదేశ్ భూమి తనఖా బ్యాంకు ఋణాల పంపిణీ రూ. 100 కోట్లు పూర్తిచేసిన సందర్భంగా ఏర్పాటుచేసిన కార్యక్రమానికి ఉప ముఖ్యమంత్రి శ్రీ జె.వి.నరసింగరావు ప్రారంభోత్సవం చేశారు. రెవెన్యూమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి అధ్యక్షత వహించారు.

7. బొంబాయిలోని న్యూఇండియా ఫిషరీస్ వారికి విశాఖ పట్టణంలో తీర సౌకర్యాల్ని కల్పించే నిమిత్తం ఆ సంస్థకూ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి మధ్య జనవరి 4న ఒక ఒప్పందం కుదిరింది.

8. చేనేతవస్త్రాలకు ఉపయోగపడే రంగులు, రసాయనాలను ఉత్పత్తిచేసే ప్లాంటును ఒక దానిని ఏర్పాటు చేసే విషయమై హాలండు కాన్సల్ జనుస్ బోల్క్ జనవరి 14న రాష్ట్ర చేనేత విషయాల మంత్రి శ్రీ అనగాని భగవంతరావును కలుసుకున్నారు.

9. ఉపముఖ్య మంత్రి శ్రీ జె.వి. నరసింగరావు జనవరి 9న జూబ్లీహాలులో రాయలసీమ, తెలంగాణా, కోస్తా ఆంధ్రప్రాంతాల అభివృద్ధికి సంబంధించిన ప్రణాళికపై ఏర్పాటు చేయబడిన మూడురోజుల సదస్సుకు అధ్యక్షత వహించారు. అమెరికా సహాయసంస్థ డిప్యూటీ డైరెక్టర్ డా. పాల్ డష్లి ప్రారంభోత్సవం చేశారు.

10. ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి జనవరి 10న ఎయిర్‌ఫోర్స్ అకాడమీకి ప్రారంభోత్సవం చేశారు.

10








### పుణ్యవతి భిక్ష

నే నెచట జూచినను నీవె యున్నది
భానువంశ తిలక నీదు భక్తుడనుమ నీను
కపట మోమాటలెల్ల కమ్మనైనవి
రామా కమ్మనైనవి.....................
తపము యోగఫలము నీవే త్యాగరాజసన్నుత ని॥

రామా! నే నెచట జూచినా నీవే కనుపడుచున్నావు. నీవు సూర్య వంశ సంభూతుడవు. అట్టి నీకు సద్భక్తుడను. నీ పలుకులు సరసవచనములు. అవి నాకు ప్రీతి పూర్వకములు. తపో యోగము నీ భక్తాగ్రగణ్యులకు సహజ ఫలితము—అని నవరసాలొలికించు నవరసకన్నడ రాగంలో సంకీర్తనచేస్తూ వీధి వీధి దాటుతున్నాడు.

ఒక వీధిలోని పుణ్యవతికి మాత్రం త్యాగ రాజుకు భిక్ష వేసే అవకాశం లభించేది గాదు. ఎందువలననగా జోలికి సరిపోవు భిక్ష లభించగానే వెనుదిరిగి వెళ్ళే స్వభావం త్యాగరాజుది, ఏతోవన వెళ్ళినా ఆమె యింటి దరిదాపులు వెళ్ళేప్పటికి జోలి నిండేది. వెనుదిరిగి వెళ్ళి పోయేవాడు త్యాగరాజు. ఆ పుణ్యవతికి మాత్రం త్యాగరాజుకు భిక్షపెట్టలేదనే నిస్పృహ మాత్రం మిగిలి పోయేది.

కాని మంచి మనసులు గల్గిన వారికి మంచి పనులు చేయుటకు అవకాశం లభింపకుంటే ధరణి నిలుస్తుందా?

తలవని తలంపుగా ఒకనాడు త్యాగరాజు ఆమె యింటి సమీపానికి రానే వచ్చాడు. ఆ పుణ్యవతి యెంతో భక్తితో బియ్యం, కూరగాయలతో బాటు నాలుగు సవరలు దెచ్చి శిష్యుని జోలిలో వేసింది. ఆ క్షణమే త్యాగరాజు దేహం ముళ్ళతో గ్రుచ్చినట్లయింది. వెంటనే వెను దిరిగి జోలిలోనికి జూచాడు. సవరలు ముళ్ళవలె కనుపించాయి. శిష్యుడు వణికాడు. చిరునవ్వుతో శిష్యునితో ఆ భిక్ష తిరిగి యిచ్చివేయమన్నాడు. ఆ గృహిణి విస్తుపోయింది. "స్వామీ! నేనేమి అపచారం చేశాను. మీకు భిక్ష వేసే అవకాశం నా కెన్నాళ్ళకో లభించింది. మీకు భిక్ష వేయాలని ఎంతో కాలం వేచియున్నానే" అని దీనంగా పలికింది.

త్యాగరాజు మృదువుగా అమ్మా! నాకు భిక్ష యిస్తే చాలును. సవరలు నిన్ను అర్థించలేదు. ధనానికి నేను దాసుడను గాను. లేమి నా సొత్తు. సంసారంలోని సుఖాలు, కలిమి మేలని తలచువారికి భక్తి కల్గునా? శరీర బలము ధన బలముతో కూడుకున్న అహంకారులకు మోక్షము గల్గుతుందా? ఇవన్నీ అనిత్యాలు తల్లీ! మంచి వారల స్నేహం, భక్తులతో చొరవ, కల్పించుకొని పరమార్థ మెరింగినపుడే జీవితం ముక్తి ప్రదమౌతుంది. ఈ కలిమితో మనము ఉప్పొంగ కూడదమ్మా.

(ఊరకే కల్గునా రాముని భక్తి, సారెకును, సంసారమున జొచ్చి, సారమని యెంచు వారి మనసున"—శహనారాగం).

అని బోధ గావించాడు. ఆమె యెంతో సంతసించి క్షమింపమని వేడి సవరలు వెనుకకు తీసుకొని సంతృప్తి జెందింది.

## నిందారోపణ

త్యాగరాజు కీర్తనలు రచన గావించడం వాటిని మధురంగా పాడడం వాడ వాడలా ప్రసారమయింది సంకీర్తనలన్నీ రాముని పరంగా వుండేవి.

కులానికి కులం తెగులు. నీటికి పాచి తెగులు. కాని చెడువున్నప్పుడే మంచికి పేరు. చీకటి వున్నపుడే వెలుగు ప్రకాశిస్తుంది. అలాగే త్యాగరాజు కీర్తి వ్యాపించడానికి అతనిపై దుష్ప్రచారం కొంత తోడ్పడింది.

త్యాగరాజును పలువురు మెచ్చుకోవడం మరి కొంత మందికి కష్టంగా దోచింది. తప్పులు పట్టడం ప్రారంభించారు కొందరు. దురాలోచనలకు అంతు వుంటుందా? కొందరికి పుట్టింది అతి తెలివి.

"చూచారా! త్యాగరాజు యెప్పుడూ రాముడూ రాముడూ అని పలవరిస్తాడే గాని నగరవాణి, ధర్మ సంవర్ధనిని యేనాడైనా

కీర్తించాడా? మన త్రిపురాంబ ఆయన కండ్లకు కనపడ లేదా! పంచనదీశ్వరుడు కనుపించలేదా!"

తోటి అసూయాపరులు కొందరు దీనికి తాళంవేశారు. జౌనని పల్లవి పాడారు కొందరు.

త్యాగరాజు చెవులకీవార్త చేరింది. కలవరపడ్డాడు. మనసు వికలమయింది. తనకేమిటీ పరీక్ష, ఈ నింద ఎందువల్ల వచ్చింది బరువయిన హృదయముతో పూజ విగ్రహాల వద్దకు వెళ్ళాడు. తదేకంగా విగ్రహాలకేసి చూచాడు. తల్లి సీతమ్మ చిరునవ్వు నవ్వి నట్లు కనుపించింది.

"తల్లీ! నీవు ధర్మసంవర్ధినివి కావూ? హరి హరులు ఒకరు గాదా? శివుడు రామజపం చేయలేదా! నీవు వేరు, అంబవేరు అని నే నేనాడు తలంచ లేదు. నగర నాయికవు. ధర్మ సంవర్ధినివి. జగదాధారాణివి. సకల చరాచర జగత్తుకు మూల స్తంభవు జీవదాన ప్రదాయినివి. నీ కను సన్నలలో మెలిగేది యీ జగత్తు. తప్పులు జేసినదానిని తల్లి దండించి మన్నించవలెగదా! తల్లి ధర్మము నీవు పాటించు. పురాణ పురుషుడైన రామునికి శివునికి, నీకూ భేదములేదని నన్ను తూలనాడువారికి తెలియ జేయి. లోకనాయిక వైన నిన్ను యింతకంటె నే నేమి కోరేది. (కరుణ జూడమ్మ కమల వైరి. తోడిరాగం).

అని సీతమ్మను దీనంగా ప్రార్ధించాడు కన్నతల్లి కొడుకు పాడిన కీర్తనలలోని బాధను, వచ్చిన నిందను తెలుసుకొంది. త్యాగూ! నీనిర్మల హృదయమే నిన్ను కాపాడుతుంది. అమాయకులు పలికిన పలుకులు లెక్కసేయకు అని మాతృశ్రీ సీతమ్మ కుమారుని ఉరడించింది. తల్లికి నమస్కరించి లేచాడు త్యాగరాజు.

## ఏలా నీదయరాదు

త్యాగరాజు నిత్య కార్యక్రమం యథావిధిగా కొనసాగి పోతోంది. శిష్యులకు సంగీత భిక్ష పెడుతూ, దొరికిన భిక్షతో సంతృప్తి జెందుతూ సర్వవేళలా రాముని కీర్తిస్తూ కాలం గడిపే వాడు.

రామ కృష్ణా నందస్వామి ఉపదేశించిన రామ షడాక్షరీ మంత్రమును దినమునకు లక్షా యిరవై యేడువేల మార్లు జపిస్తూ, తొంభై యారు కోట్లు పూర్తి జేశాడు.

అప్పటికి త్యాగరాజుకు ముప్పదెనిమిదేండ్లు. తొంభై యారు కోట్ల రామనామ షడాక్షరీ మంత్రోపాసన పూర్తి కాగానే రామునికి ప్రత్యేకంగా పూజసలిపాడు. ఏకాగ్ర చిత్తముతో రాముని ధ్యానించాడు. త్యాగరాజు తనువునుంచి సువాసన వెలువడింది. ముఖంలో కాంతి వెల్లి విరిసింది. పూజాకార్యక్రమం చూడవచ్చినవారు యెంతో ఆశ్చర్య పడ్డారు. రాముని దర్శన మయిందేమోనని తలంచారు పెద్దలు.

త్యాగరాజు తనువుగగుర్పొడిచింది. లీలా మాత్రంగా త్యాగరాజు నేత్రద్వయానికి శ్రీరాముడు, సోదరుడు లక్ష్మణ స్వామితో విశ్వామిత్రుని వెంట యాగ రక్షణార్ధం నడిచి పోవుచున్న దృశ్యము కనుపించినది.

వెను వెంటనే సరళ సాహితీ స్రవంతి త్యాగరాజు కంఠం నుంచి ప్రవహించింది.

బాలకనకమయ చేల, సుజనపాల
శ్రీరమాలోల విధృత శరజాల
శుభద కరుణాలవాల
ఘననీల, నవ్యవన మూలికాభరణ
ఏలా నీదయరాదు...

అఠాణారాగంలో యువరాముని కీర్తించాడు.

రామా! సమస్త బాణధారివి. సర్వశుభప్రదాయినివి. నీలమేఘ శ్యాముడవు నిత్య నూతన వనమాలికా భరణుండవు. అమృత హృదయులైన యోగిజన పరివేష్టితుండవు. సాంద్ర గంభీరుడవు. దనుజ సంహారివి. పండితోత్తమ బృందవు. సకల వేద సారుడవు. రామా! నీ రెండు చక్షువులు సూర్య చంద్రులు, ఇంద్రాది దేవవందితుడవు గజరాజ పాలకుడవు. పున్నాగ పుష్పాభరణుడవు. శేషశయనుడునూ నీవే, రామా! పవమాన సుతుడు నీపాదములను భక్తితో కొలుస్తున్నాడు. రాగరహితుడవయిన నిన్ను నేను కొలుస్తున్నాను. హృదయ పూర్వకంగా నమస్కరిస్తున్నాను మరల ఒక మారు దర్శనమియ్యవా, నన్ను కరుణించవా అని గానంచేశాడు.

శిష్యులు గురుదేవునికి ప్రణమిల్లారు. భక్త జనం నమస్సులర్పించారు. కమలాంబ భర్త పాదాలనుకడిగి తీర్థం తన శిరస్సుపై చల్లుకొంది, సీతమ్మ ఆనందాశ్రువులతో కుమారుని కనులారా చూచుకొంది.

## స రి గ మ ప ద ని

స్వర మధురిమలు ఏడు. సడ్జమము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, దైవతము, నిషాదమఅని యోగిక నామములు.

ప్రకృతిలో శోభిల్లుచున్న సప్త స్వనముల కాలవాలము శుద్ధ నాదము. సామవేద జనిత సారము సంగీతము. నాదస్వరము నుపాసించు జనుల ననుగ్రహించుట కొరకే శివుని సద్యోజాత, అఘోర, తత్పురుష, ఈశానవామదేవములనే పంచ ముఖములనుండి స్వరములు ఆవిర్భవించినవి. అట్టి సప్త స్వర శాస్త్రోపాసన జేసినవారు యమునికి సైతం భీతిచెందవలసిన భయములేదు. శివుని పంచ ముఖములు మానవుని యందుగల నాభి హృత్కంఠ రసన నాసాదులు. స్వరశుద్ధిగల వ్యక్తికి స్వామి అనుగ్రహము పొందుట సులభము. సప్త స్వరములు ఎందరో భక్తుల హృదయములలో నిండి, సర్వజన శుభములు గలుగజేయును. (శోభిల్లు సప్తస్వర-జగన్మోహినిరాగం).

శంకరుడు నాదస్వరూపుడు. జ్ఞానమూర్తి శుద్ధనాదము శంకరుని ప్రతిబింబము. మనస్సును నిశ్చలపరచుకొని ఏక లక్ష్యంతో నాదస్వరూపుని కీర్తించిన జ్ఞానవంతు లౌతారు. తద్వారా ఆత్మానందం పొందుతారు. అంతకన్న ఆనందం ఋూ

విశ్వంలో యేమున్నది, శంకరా! నీకు మనసా నమస్కరిస్తున్నాను. (నాదతనుమనిశం-శంకరం-నమామి మనసా శిరసా -చిత్తరంజని రాగం):

త్యాగరాజు శ్రీరాముని సంగీతమూర్తిగాకూడా కీర్తించాడు. శ్రీరాముని ధనస్సుకు చిరుగంటలుయేడు. వాటినుంచి వెలువడు శబ్ద తరంగాలే స రి గ మ ప ద ని సప్తస్వరాలు. ఈ సప్త స్వరాల కాలంబనము కోదండము. ఆ కోదండము రాగస్థానము రాముడు వదలు బాణము స్వర సంగీత కళలు. అంతేగాదు వాల్మీకి వ్యాసాది మహాకవులు తమ కవితను రాగ భావ యుక్తంగా లవకుశ, శుక, శౌనకాదులచే రమ్యంగా గానం చేయించి తరించి కైవల్యం పొందారు. (నాదసుధా రసంబిలను-ఆరభి రాగం)

నృత్యవాద్య గీతికలచే పునీతుడై తత్వార్థమును తదనుగుణంగా ప్రస్ఫుట పరచువాడు ధన్యుడు. భగవంతుని కీర్తించుటకు పరుష శబ్దప్రయోగములు వ్యర్థములు. చిరుమాటలతో భావ యుక్తంగా పలికితేచాలు. పోతనామాత్యుడు 'ఇందుగలడందులేడను' పద్యంలో భగవంతునికి ఉనికి యెక్కడ అనే విషయాన్ని ఎంత చక్కటి చిన్నమాటలతో బోధపరిచాడు! లలిత భావముతో సరళ సరస శబ్దములతో జానపదునిసైతం సంతోషింపజేసిన విద్వాంసుని ప్రతిభే ప్రతిభ.

ఇదే భావమును కల్యాణి రాగములో "ఏ తావునరా నిలకడ నీకు యెంచిచూడ నగపడవు'' అని గానం చేశాడు. ప్రకృతి స్వరూపిణులయిన సీత, గౌరి, సరస్వతులయందు వసించియున్నావా! త్రిమూర్తులలో నిండుగ నిలచియున్నావా ? నవగ్రహాది పతుల లోకము లన్నింటిలో వెలసియున్నావా ? నీకు నిలకడ యెక్కడిది. సర్వత్రా నీవేగదా. సకల దేవతలు తమతమ కీర్తనలతో నిన్ను సంతోష పరుస్తున్నారు".

కళలలో అత్యుత్తమమయిన కళ సంగీతము. సకల జీవరాసులు సంతోషం జెందుతాయి. అందుకే నాదోపాసన ప్రతీ మానవుని లక్ష్యమని త్యాగరాజు బోధించాడు.

సంగీతమొక సాధన. దైవత్వాన్ని ప్రసాదించే కళ. హృదయానందం కలిగించే భగవంతుడు యిచ్చిన భిక్ష. జ్ఞానము కన్న సుఖవుగా లభించేది సంగీతము. అట్టి సంగీతముతో జ్ఞానము సముపార్జించుకొనవచ్చును. బ్రహ్మానందం కలిగించే సంగీతం విశ్వ వ్యాపితము. సకల కళామతల్లులకు తల్లి సరస్వతి. ఆ సరస్వతి చేబట్టినది కచ్ఛపి (సరస్వతి వీణ పేరు కచ్ఛపి) అందుండి వెలువడిన సంగీతపు పన్నీటి జల్లులనే సంగీతకారులు ఆస్వాదించారు. ఆనందించారు. ఇతరులను ఆనందింపజేశారు. త్యాగరాజు ధన్యాసి రాగంలో పై భావాన్ని ఆలాపించాడు.

''సంగీత జ్ఞానము భక్తి వినా
సన్మార్గము కలదే మనసా
భృంగిన టేశ, సమీరజ ఘట జమతంగా
నారదాదు లుపాసించే ——సం॥
న్యాయాన్యాయములు తెలియును జగములు
మాయామాయమని తెలియును దుర్గుణ
కాయజాది షడ్రిపుల జయించే
కార్యము తెలియును త్యాగరాజునికి ॥సం॥

## విదులకు మ్రొక్కెద

తన శిష్యుడు కీర్తనలు రచిస్తూ దివ్య నామావళితో శ్రీరాముని కొలుస్తున్నాడనే వార్త శ్రీ శొంఠి వెంకటరమణయ్య పంతులుగారి చెవిలో పడింది.

మహదానందంజెంది వెంటనే తన యింటికొకమారు రావలసినదిగా ఆహ్వానం పంపాడు

గురువుగారి ఆహ్వానాన్ని ఆజ్ఞగా స్వీకరించి శిష్యబృందంతో తంజావూరు చేరుకొన్నారు.

పంతులుగారు, శిష్యుని రాకకెంతో సంతసించాడు. ఆశీర్వదించారు. శిష్యులు గురువుగారి గురువుగారయిన పంతులుగారికి పాదాభివందన జేశారు. పంతులుగారు వారి వినయమునకెంతో మెచ్చుకొని వారి సంగీతం ప్రతిభ దిగ్విజయీకృతం కావాలని ఆశీర్వదించారు

త్యాగరాజా ! నీవు మధుర కీర్తనలను గానం చేస్తున్నావని విని ఆనందించాను. నీ గురువయిన నన్ను ఆనందపరచడం నీ కర్తవ్యంగాదూ-అని చిరునవ్వుతో పలికారు.

గురువుల పాదసన్నిధిలో పాడటం నా విధులలో ఒకటి స్వామీ అని వినయంగా విన్నవించుకొన్నాడు త్యాగరాజు.

త్యాగరాజు గురువుగారి సమక్షంలో పాడబోతున్నాడని వలువురికి తెలిసింది.

పంతులుగారు ఎందరో విద్వాంసులను సంగీతమూర్తులను స్వయంగా ఆహ్వానించారు.

అందులో ప్రముఖులు శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితర్.

శ్రోతలకు హృదయ పూర్వకంగా నమస్కరించాడు. తన గానం వినడానికి ఉవ్విళ్ళూరుతున్న వారిని సంతోషపరచాలని, గురువుగారి సాన్నిధ్యంలో శ్యామశాస్త్రి, దీక్షితర్‌లాంటి పెద్దల యెదుట పాడడం తన జీవిత పుటలలో మహత్తరమయిన సన్నివేశమని తలంచాడు త్యాగరాజు.

తన విపంచిక నందుకొన్నాడు.

శిష్యులు తమ తమ వాద్యాల ముందుంచుకొన్నారు.

ప్రథమంగా పెద్దలకు నమస్కరింపవలెననే భావంతో మాయా మాళవ గౌళరాగాలాపన జేసి "విదులకు మ్రొక్కెద, సంగీత కోవిదులకు మ్రొక్కెద" అని గానం చేశాడు.

ప్రథమ వరుసలో కూర్చున్న పంతులు గారు, శ్యామాశాస్త్రి, దీక్షితర్‌గారలు త్యాగరాజు మధురభావానికి ముగ్ధులైనారు.

(సశేషం)

# మహాభారతము

తెన్నెగంటుల లక్ష్మణశాస్త్రి

యాగనిర్వహణ బాధ్యతనుండి బృహద్ద్యుమ్న మహారాజు పరావసువును తొలగింపజేసెను. ఆ తరువాత దేవతలు ప్రసన్నులై అర్వావసువును వరములను కోరుకొనుమనిరి. అతడు "తనతండ్రియగు రైభ్యముని పునః జీవించునట్లును, తన సోదరుడగు పరావసువు బ్రహ్మహత్యాదోషము నుండి విముక్తుడగునట్లును తన తండ్రిని తాను వధించినట్లు అతనికి స్మృతికి రాకుండునట్లును, భరద్వాజ మహాముని, యవక్రీతుడు పునర్జీవితులగునట్లును, సూర్య మంత్రమునకు ప్రతిష్ఠగలుగునట్లును ప్రసాదింపు" డని వరములను కోరెను. దానికి దేవతలు ప్రసన్నులై ఆవరములను అర్వావసువునకు ప్రసాదించిరి.

ఆ వర ప్రభావముచేత ఆ మునులందరు పునర్జీవితులైరి. అప్పుడు యవక్రీతుడు ఇంద్రాది దేవతలతో "మహాత్ములారా! నేను వేదాధ్యయనము చేసితిని. వేదవిహితవ్రతములను అనుష్ఠించితిని. గొప్ప తపస్సును చేసితిని. ఇట్టి నన్ను రైభ్యముని సంహరించుటకు సమర్థుడెట్లయ్యెను?" అని యడిగెను. దానికి దేవతలు, "యవక్రీత మహామునీ! నీవనుకొన్నది సరికాదు. నీవు పూర్వకాలమునందు గురువులేకుండగనే సులభముగా వేదాధ్యయనము చేసితివి. రైభ్యుడో గురు శుశ్రూషచేసి గురువును సంతోషపరచి, గురుకులవాస క్లేశమననుభవించి వేదములను నేర్చుకొనెను. కనుక నీ విద్యాభ్యాసములోను, అతని విద్యాభ్యాసములోను చాల అంతరము కలదు కనుక అతడు నీకన్న శ్రేష్ఠు''డని చెప్పి దేవతలు అందరిని జీవింపజేసి అంతర్ధానము చెంది స్వర్గమునకు పోయిరి.

'ధర్మరాజా! అట్టి రైభ్యమునియొక్క ఆశ్రమమిది. ఫలపుష్పవృక్షశోభితమగు ఈ యాశ్రమములో నొకరాత్రి నివసించి నీవు సర్వ పాపవిముక్తుడవై ముందుకు సాగిపొమ్ము' అని లోమశుడు చెప్పి తరువాతి కథ నిట్లు చెప్పదొడగెను :—

"ధర్మరాజా! 'ఉశీరబీజ, మైనాక, శ్వేత, కాలశైల' పర్వతములను దాటివచ్చితిమి. ఈ పైన ఏడు పాయలుగా చీలినగంగానది కనబడుచున్నది. ఇది రజోగుణ రహితమైన పుణ్యతీర్థము. ఈ తీర్థమునందు అగ్నిదేవుడు సర్వదా ప్రజ్వలించుచుండును. ఇది సామాన్య మానవులకు దర్శనయోగ్యముగాదు. సావధానమగు మనస్సుతో దీనిని నీవు దర్శింపుము. ఈ తరువాత మనము కైలాస-మందర పర్వతములను సమీపించెదము. అచ్చట 'మాణిభద్రుడు' అనుయక్షుడు యక్షరాజగు 'కుబేరుడు'ను నివసించి యుందురు. అచట అనేక సహస్ర యక్ష-గంధర్వ-కింపురుషులు మాణిభద్రుని సేవించుచుందురు. వారు తలచినచో నింద్రునిగూడ అతని స్థానమునుండి తొలగించగలరు. ఇచట కుబేరానుచరులను మన మెదిరించవలసి యుండును. దానికి మీరు సంసిద్ధులై యుండవలెను. వారు అతి బలసంపన్నులు.

''రాజా! కైలాసపర్వతము ఆరు యోజనముల (ఆమడలు) యెత్తుండును. సమస్త దేవతలు అచటకువచ్చుచుందురు. ఈతీర్థములన్నిటిలో స్నానము చేసినయెడల నీకు సర్వ శుభములు కలుగును" అని చెప్పి లోమశుడు గంగానదిని ఇతర తీర్థములను గూర్చి ధర్మరాజునకు సకల శుభములు కలిగింపుడని ప్రార్థించెను. అది విని ధర్మరాజు తన అనుచరులతో ''నేడు లోమశునికి ఎన్నడును లేని భయము కలుగుచున్నది. ఇదిచాల దుర్గమమైన ప్రదేశము గనుక ద్రౌపదిని జాగరూకతతో కాపాడుకొనుచు సదాచార విచారములు కలవారై యిటనుండి ముందుకు సాగుడు.'' అని చెప్పెను. అప్పుడు యుధిష్ఠిరుడు భీమసేనునితో నిట్లనెను :—

"ఇచట రాక్షసులు దాగియుండి కనపడినవారిని బాధపెట్టుచుందురు. కనుక ఈ చోట అగ్నిహోత్రము—తపస్సు ఈ రెంటి బలముచేతనే మనను కాపాడుకొనుచు ముందుకు సాగిపోవలెను. నీవు కేవలము ఆత్మబలముతోనే మెలగుచు ఆకలి దప్పులను జయించి చాతుర్యముతో నుండుము. ఈ కైలాసము చాల గొప్పదని లోమశుడు చెప్పెనుగదా! దీనిని చూడుము. ద్రౌపదిని జాగ్రత్తగా తోడ్కొని నడవుము. అథవా, నీవు సమస్త పరివారముతో తిరిగిపొమ్ము. నేను, నకులుడు, లోమశుడు ముగ్గురము మాత్రమే నియతాహారులమై, వ్రత నిష్ఠతో ముందుకు పోయెదము. మేము తిరిగి వచ్చువరకు నిరీక్షించుచు నీవు పరివారముతో, ద్రౌపదిని కాపాడుచు హరిద్వారమునందు ఉండుము". ఆ మాటలు విని భీముడు ధర్మరాజుతో నిట్లనెను :—

"రాజా! ఈ ద్రౌపది దుఃఖార్తురాలై శ్రమపడుచున్నప్పటికిని అర్జునుని చూచునిచ్ఛతో వచ్చుచున్నది. నాకుగూడ అర్జునుని చూడవలెనను నిచ్ఛమిక్కుటముగా నున్నది. మమ్ము తిరిగి పొమ్మనినచో నీయాజ్ఞ నిర్వర్తించెదము గాని ఇట్టి దుర్గ మారణ్యములో నిన్ను ఒంటరిగా విడిచి పోవజాలకున్నాను. ద్రౌపది యభి

ప్రాయము గూడ అట్లేయున్నది. మేమందరము అర్జునుని చూడ గోరుచున్నాము. అందుచేత మనమందరము కలిసియే ముందుకు పోవుదముగాక. ఇచట గుహలు, పాషాణములమధ్య రథములు సాగజాలకున్నచో మనము పాదచారులమయియే పోవుదము. నీవు నిరుత్సాహపడకుము. ద్రౌపది నడవజాలనిచోట్లలో నామెను నేను భుజములపైన ఎక్కించుకొని నడచెదను. దుర్గమమార్గము లందు సుకుమారులగు నకుల సహదేవులనుగూడ నేను దాటించెదను ఆ మాటలకు యుధిష్ఠిరు డిట్లనెను :—

"భీమసేనా ! ఈ విధముగా వీరవచనములు మాట్లాడుచున్న నిన్ను చూచి నాకు ఆనందము కలుగుచున్నది. నీ బలము, తేజస్సు అభివృద్ధి చెందునుగాక. నీ కీర్తి, ధర్మము వర్ధిల్లునుగాక. ఈ మార్గమునందు నీకు శ్రమగాని, అపజయముగాని కలుగకుండును గాక" అని యాశీర్వదించెను. ఆ తరువాత ద్రౌపది, రాజా! నేను మీతోపాటు నడిచివచ్చెదను. నన్ను గూర్చి మీరు విచారపడకుడు' అని చెప్పెను.

తరువాత లోమశుడు, 'రాజా! ఈ గంధమాదనపర్వతమును తపశ్శక్తితోనే దాటిపోవలెను. తపోబలముచేతనే మనమందరము ఈ దుర్గమప్రదేశములన్నింటిని దాటి తప్పక అర్జునుని చూడ గలము.'' అని చెప్పెను.

ఈ విధముగా మాట్లాడుకొనుచు వారందరు ముందుకుసాగి నడచుచుండిరి. కొంతదూరము పోయినతరువాత ఆటవికజాతులకు రాజగు 'సుబాహువు' యొక్క రాజ్యమును చూచిరి. అచట అనేకులు అడవిజాతులవారు తిరుగాడుచుండిరి. వివిధవాహనములు ఉండెను. అది హిమాలయమునకు సమీపములో నుండెను. దానికి 'కుళింద' దేశము అని పేరు. ఆ దేశమును చూచి యుధిష్ఠిరాదులు మిక్కిలి ప్రసన్నులైరి. పాండవులు తన రాజ్యములోనికి వచ్చుచున్నారని తెలిసి కుళిందరాజగు సుబాహుడు మిక్కిలి సంతోషించి స్వాగతసత్కారపూర్వకముగా వారిని ఎదుర్కొని తోడుకొనివచ్చి ఆతిథ్య మిచ్చెను. వారుగూడ నచట సుఖముగ ఆనాడు నివసించిరి.

మరునాడు ఉదయము ధర్మరాజు తన పరివారమువారినందరను సుబాహువువద్దనే ఉంచి తమ్ములతోను, ద్రౌపదితోను లోమశునివెంట పాదచారులై హిమాలయమువైపునకు అర్జునదర్శనాభిలాషచేత ప్రయాణమై పోయిరి.

యుధిష్ఠిరుడు ఈ విధముగా భీమసేనాదులకు ఉపదేశము చేసెను:— ''పూర్వజన్మకర్మలు అనుభవింపబడక నశించవు. ఆ కారణముచేత నేడు మనము రాజకుమారులమైయుండికూడ కష్టము లనుభవించుచున్నాము. మనము దుర్బలులమై, క్లేశముల ననుభవించుచుగూడ ఈ మార్గములో పోవుచున్నాము. దీనికి అర్జునదర్శనాభిలాష తప్ప వేరు కారణములేదు. అతనిని చూడజాలక పోవుటచేత నా శరీరమును, దూదిని అగ్నివలె, పరితాపము దహించుచున్నది. ఈ యవసరములో, పూర్వము ద్రౌపదికి జరిగిన అవమానము తలపునకువచ్చినపుడెల్ల నా హృదయము మరింత దహించుకొనిపోవుచున్నది. అర్జునుని చూచుటకే నేను మీతోపాటు ఈ తీర్థములను, వనములను, క్షేత్రములను అన్నిటిని తిరుగుచున్నాను. అతనిని చూచి ఐదేండ్లైనది. అతడు మహా బలపరాక్రమశాలి. అతని బలముచేతనే మనమందరము ధైర్యముతో కాలము గడపుచున్నాము. శరణాగతరక్షణము అతని వ్రతము అతని బాహుబలముచే సంపాదితములైన సమస్తరత్నములు నా సభను శోభిల్లజేసినవి అతడు వీర్యములో కృష్ణసమానుడు, యుద్ధములో కార్తవీర్యార్జునుని మించినవాడు. అతని వేగములో వాయువు, ముఖములో చంద్రుడు, క్రోధములో మృత్యువు సర్వదా నివసించుచుందురు. అట్టివానిని చూచుటకిపుడు మనమందరము గంధమాదనపర్వతమువైపు ఉత్సుకులమై పోవుచున్నాము. అదుగో, గంధమాదనము. దానిపైన బదరీవృక్షము, నరనారయణాశ్రమము కలవు. ఇందు యక్షరాక్షసులు ఉందురు. కుబేరుని రమ్యపుష్కరిణి యున్నది. మనము కాలినడకతోనే బాధపడుచు అక్కడకుపోవుదము. వాహనములతో నచటకు పోవజాలము. క్రూరులు, లుబ్ధులు, అశాంతులు అచటకుపోవజాలరు. మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహములేనివారలు అక్కడికిపోయినచో నచటనున్న ఈగలు, దోమలు, సింహములు, వ్యాఘ్రములు, సర్పములు వారిని బాధించును. నియమవ్రతనిష్ఠులను అవి యేమియు చేయజాలవు. అవి వారికి కనపడవుకూడ. కనుక భీమా ! మనము నియమవ్రతములతో, నియతాహారముతో ఈ గంధమాదన పర్వతమును చేరుదము. అచటనున్న అర్జునుని చూచెదముగాక."
యుధిష్ఠిరుని మాటలువిని లోమశుడిట్లు చెప్పదొడగెను:—

''పాండుకుమారులారా! మీరు అన్ని పర్వతములను, నదులను, పురములను, అడవులను, తీర్థములను దర్శించితిరి. ఇదిగో ఈ మార్గము మందరపర్వతమును చేర్చును. ఇది దేవతలకు మునులకు నివాసస్థానమగును. మీరందరు ఏకాగ్రచిత్తులై, తత్తరపాటు లేకుండ ప్రశాంతముగా నడవవలెను.

''ఇదిగో, ఇది మంగళజల ప్రవాహముగల గంగానది. దీనికి 'మహానది' 'అలకనంద' యనికూడ పేర్లు కలవు. దేవతలు ఋషులు దీనిని సేవించుచుందురు ఇది బదరికాశ్రమమునందు పుట్టును. వాలఖిల్యాది మహామునులు ప్రతిదినము దీనిని సేవించుటకు వచ్చెదరు ఇచట మునీశ్వరులు సర్వవేదములను గానము చేయుచుందురు. ఇంద్రాది దేవతలు ప్రతిదినము ఇచట సంధ్యాను ష్టానములు చేసికొనుచుందురు. సూర్య-చంద్ర-నక్షత్రములు రాత్రింబవళ్లు ఈ నదిని చుట్టి సేవించుచుండును భగవంతుడగు శంకరుడు జగద్రక్షణార్థమై ఈ గంగాజలమును హరిద్వారమునందు తన తలపై ధరించెను. ఇట్టి పవిత్రగంగానదిని మీరు నియతాత్ములై సమీపించి అభివాదముచేయుడు '' లోమశుడు చెప్పిన ప్రకారము పాండవులు గంగకు నమస్కారముచేసి ముందుకు సాగిపోయిరి.

వారు ఎదురుగా కనపడుచున్న యొక పర్వతమును చూచిరి అది శ్వేతపర్వతమువలె నుండెను. మేరువువంటి ఆ పర్వతము సమస్త దిక్కులకు వ్యాపించి యున్నట్లుగా వారికి కనపడెను. దానిని గూర్చి అడుగదలచుచున్న పాండవుల యింగితమెరిగి లోమశుడిట్లు అనెను:—

"పాండు కుమారులారా! కైలాసమువలె తెల్లగా ఈయెదుట కనపడుచున్నది నరకాసురుని యెముకల గుట్ట. ఆ యెముకలు పాషాణముల పైనను, కొండచరియలపైనను నుండుటచేత పర్వతమువలె కనపడుచుండును. పూర్వము నరకాసురుడు ఇంద్రపదవిని కాంక్షించి ఘోరముగా తపస్సు చేసెను, తన తపోబలముచేతను, బాహుబలము చేతను ఇంద్రాది దేవతలను, మునిసంఘమును భయపరచుచుండెను. ధర్మాచరణము చేయుచు బలదర్పములతో నున్న నరకాసురుని జయించుటకు సాధ్యముగాక యింద్రుడు సపరివారుడై విష్ణువును ప్రార్థించగా విష్ణువు అనుగ్రహించి నరకాసురుని తేజస్సును ఆకర్షించెను దానితో నతడు కూలిపడెను. అతని అస్థిసమూహమే యిట్లు పర్వతాకారముతో మనకు కనపడుచున్నది. పాండవులారా ! మహావిష్ణువుయొక్క అద్భుతమగు మరియొక చరిత్రను చెప్పెదను వినుడు" అని లోమశుడిట్లు చెప్పదొడగెను. వరాహావతార కథనము :—

" పూర్వము కృతయుగమునందు ఒకప్పుడు చాల భయంకరమగు పరిస్థితి యేర్పడెను అప్పుడు భగవంతుడగు విష్ణువు యముని కార్యమునుగూడ తానే నిర్వహించుచుండెను. అప్పుడు ఏ ప్రాణిగూడ మరణించకుండెను. గాని ప్రాణుల ఉత్పత్తి మాత్రము ఆగక సాగుచుండెను. పుట్టిన ప్రాణులన్నియు పెరుగుచు భూమికి అతిభారమాయెను,ఆబరువునుసహించజాలక భూదేవి శ్రీ మహావిష్ణువును, తన భారమును దించుమని ప్రార్థించెను, ఆ మాటవిని ఆ మహాదేవుడు భూదేవిని అనుగ్రహించి, 'దేవీ ! నీ భారమును తగ్గించెదను' అని భూదేవికి చెప్పి ఆమెను పంపెను.

"ఆ తరువాత విష్ణుదేవుడు ఒక కోరగల వరాహముగా అవతరించెను. ఎఱ్ఱని కన్నులతో నల్లగానున్న యతని దేహకాంతి ప్రపంచ మంతటను అగ్ని ధూమములను వ్యాపింపజేయుచున్నట్లుండెను. అప్పుడా దేవుడు భూదేవిని తన కోరపైన ధరించి అనేకయోజనములయెత్తు పైకిలేచెను. అంతటితో సమస్త దేవ-ముని–మనుష్యాది ప్రాణులు మిక్కిలి భయముచెంది గగ్గోలుపడి బ్రహ్మదేవుని వద్దకుపోయి యిట్లగుటకు కారణమడిగిరి. అప్పుడు బ్రహ్మ నాయనలారా ! మీకు రాక్షసుల వలన ఈ భయమేర్పడలేదు, భగవంతుడగు విష్ణువు ఈ భూమిని పైకెత్తెను. దానివలన మీకీభయము కలిగెను.' ఆ మాటలు విని దేవతలు. మహాత్మా ! శ్రీ మహావిష్ణువు ఇప్పుడెచట నున్నాడు ? ఎక్కడి నుండి యీ భూమిని పైకెత్తుచున్నాడు ? తెలుపుడు ! అని అడిగిరి. ఆ మాటకు బ్రహ్మదేవుడు దేవతలతో, ఇప్పుడు విష్ణువు నందనవనములో నున్నాడు. సువర్ణ వర్ణముగల వెంకటుని తో' మహా వరాహమూర్తియై ప్రళయాగ్నివలె ప్రజ్వరిల్లుచున్నాడు. ఆ వరాహస్వామియొక్క వక్షస్థలముపై మీకు స్పష్టముగా శ్రీవత్సము గోచరించును ? అని చెప్పెను. అప్పుడు దేవతలు బ్రహ్మదేవుని ప్రార్థించి యాతని ముందిడుకొని ఆదివరాహస్వామి దర్శనార్థులై ఆయన వద్దకుపోయి ఆ స్వామిని దర్శించి, అతని యాజ్ఞచేత తిరిగి బ్రహ్మాదులు తమ తమ స్థానములకు పోయిరి.

లోమశుడు చెప్పిన వరాహావతార కథను విని పాండవులు సాయుధపాణులై గంధమాదన పర్వతమును చేరుటకు ముందుకు సాగిపోయిరి. ఆ పర్వతముపైనున్న సరస్సులను, నదులను, వనములను చూచిరి. మనో నిగ్రహముగలవారై, నియతాహారము చేయుచు వివిధ మృగములను చూచుచుపోయి దేవర్షి – సిద్ధామర సేవితమగు గంధమాదన పర్వత సమీపమును చేరిరి వారు చేరగానే యా పర్వతముపైన ప్రచండ వాయువుతోగూడిన వర్షము కురియసాగెను. అందురేగిన దుమ్ము భూమ్యాకాశములకు వ్యాపించెను. పాషాణ చూర్ణములలో గూడిన ధూళి కన్నులలోపడగా వారు ఒంటొరులను చూచుటకుగాని భాషించుటకుగాని శక్తిచాలని వారైరి. ఆ సుడిగాలికి విరిగిపడిన మహావృక్షముల ధ్వని, మిన్ను విరిగి పడినప్పటి ధ్వనిగా వారు భావించిరి అక్కడ చిన్నవృక్షములను, మిట్టపల్లపు ప్రదేశములను ఆధారముగా జేసికొని వారు తమప్రాణ రక్షణము చేసి కొనుచుండిరి

అప్పుడు భీమసేనుడు ధనుస్సు ధరించి ద్రౌపదిని చేరదీసికొని ఒక చెట్టును ఆశ్రయించి నిలిచియుండెను. ధర్మరాజు ధౌమ్యుడు, లోమశుడు తదితరులు అగ్నిహోత్రమును కాపాడుకొనుచు తమ తమకు అందిన వృక్షముల నాశ్రయించి నిలిచియుండిరి. ఆ గాలి ఆగిపోయి, దుమ్ము అణగిన తరువాత ఘోరజలధారలతో మహావర్షము కురియసాగెను. ఆకాశమునుండి పిడుగులు పడుధ్వని వినవచ్చెను భూమ్యాకాశములు విద్యుత్కాంతులతో తేజరిల్లెను. వడగండ్ల ధారలవలె భయంకరముగ వానధారలు పడుచుండెను. పిడుగులు పడుచున్నట్లు పటపటా శబ్దము ఉత్పత్తిల్లెను. జల ప్రవాహములు సముద్ర గాములగు మహానదులవలె నురుగులతో గోచరించుచుండెను. చంద్రులవంటి, పడవలవంటి నురుగులతో ప్రవహించుచున్న జలము పరిసర వృక్షముల నాకర్షించుకొనుచు పారుచుండెను. ఆ శబ్దము అణగి, సుడిగాలి ఆగి, నీరు పల్లములలోనికిపోయి, సూర్యుడు ఆకాశమున తేజరిల్లగా వారందరు నిర్భీకులై గంధమాదనము వైపునకు సాగిపోయిరి.

కొంచెముదూరము నడవగనే ద్రౌపది, అంతకుముందే గాలివానవలన అలసియున్నది గనుక ముందుకు నడవజాలక సోలిపోయి మూర్ఛిల్లెను. అప్పుడు నకులుడామెను పడకుండ పట్టుకొని 'రాజా! సుకుమారియగు పాంచాలి నడవజాలక మూర్ఛిల్లుచున్నది. ఈమెను ఊరడించుడు' అనెను ధర్మరాజు, భీమ సహదేవులు ఆ మాటవిని మిగుల దుఃఖితులై ఆమెకడకుపోయిరి. ధర్మరాజు ఆమెను ఒడిలోకి తీసికొని:– 'అయ్యో! సురక్షితమైన రాజసదనమునందు హంసతూలికా తల్పములపైన సుఖాసీనురాలగు నీమె కఠిన కంటక పాషాణ భూమిపైన శయనించవలసి వచ్చెనే? సుకుమారములగు కరచరణములు ముఖ కమలము వాడిపోయినవే. దీనికంతకు కారణము నేను గదా! జూదరినై రాజసము గోల్పోయి ఈ సుకుమారిని వెంటగొని క్రూరమృగాకీర్ణమగు ఘోరాటవియందు సంచరించుచు నేనెంత పాపకర్మము చేయుచున్నాను? 'పుత్రీ ! పాండవులను చేపట్టి సుఖింతువు' అని ద్రుపదరాజు ఆశీర్వదించి యెంతయో సంతోషముతో వివాహముచేసెనే! ఆ సుఖము లేవియు ననుభ

వించకయే నా పాపకర్మల ఫలముగా పాషాణ భూమిపైన శయనించు చున్నదే!' అని విలపించెను. ధౌమ్యాదులు గూడ అచటికి వచ్చిరి. ఆ మహాత్ములు వారిని ఓదార్చి, ఆశీర్వదించి రాక్షసఘ్నములగు మంత్రములను జపించిరి. వారు మంత్రములను పఠించుచుండగా, పాండవులు మృదుకర స్పర్శచేయుచుండగా, నీటి తుంపురులతో గూడిన శీతలవాయువు వీచుచుండగా ద్రౌపది మెల్లగా మూర్ఛ దేరెను.

అప్పుడు పాండవులామెను మెల్లగా లేపి కృష్ణాజిన శయనముపై పరుండబెట్టిరి. నకుల సహదేవులామెకు పాద సంవాహనము చేసిరి. యుధిష్ఠరుడామె నూరడించుచు భీమునితో విషమములు, హిమాకీర్ణములు దుర్గమములునగు, పర్వతములపైన ఈ సుకుమారియెట్లు సంచరించగలదు?' అనెను ఆ మాట విని భీమసేనుడు "రాజా! నిన్ను, ద్రౌపదిని, నకుల సహదేవులను నేను ఎత్తుకొని నడచెదను. నీవు విచారించకుము హిడింబా పుత్రుడగు ఘటోత్కచుడు నాతో సమానమగు బలముగలవాడు. ఆకాశము నందు గూడ ఎగిరిపోగలవాడు. నీవు ఆతనికి ఆజ్ఞ యిచ్చినచో నతడువచ్చి మనందరను మోయగలవాడు " అని చెప్పెను.

'అతనిని పిలువుమని ధర్మరాజు భీమునితో జెప్పెను. భీముడు ఘటోత్కచుని తలచెను. స్మరించిన మాత్రముననే ఘటోత్కచుడు వచ్చి తండ్రులకు, అక్కడనున్న పెద్దలకు నమస్కరించెను 'తండ్రీ! నన్ను తలచిన కారణమేమి? ఆజ్ఞయిండు' అనియెను. భీముడు సంతసించి కుమారుని ఆలింగనముచేసికొనెను. "భీమసేనా! ధర్మజ్ఞుడు శూరుడు బలవంతుడు, విశేషించి మనకు భక్తుడునగు ఘటోత్కచుడు మనను ఎత్తుకొనిపోవుగాక. మన పుత్రుడగు నితడుండగా మనము ఏ బాధలు అనుభవించకయే పాంచాలితో సుఖముగా నీమార్గమును గడచెదము"అని ధర్మరాజు భీమసేనునితో ననెను.

అప్పుడు భీముడు ఘటోత్కచునకు ఆజ్ఞయీయగనే నతడు ద్రౌపదిని ఎత్తుకొనెను. అతనిచేత సృష్టించబడిన రాక్షసపుంగవులు తక్కినవారందరిని ఎత్తుకొనిరి. లోమశ మహాముని తన తపోమహిచేతనే స్వయముగానాకాశగమనము చేయసాగెను. అప్పుడతడు రెండవసూర్యునివలె నాకాశమునందు భాసిల్లెను. ఈ విధముగా రాక్షసులచేత మోయబడుచు వారు అనేక గిరినదీవనములను దాటుచు సువిశాలమగు బదరీ వనమును చేరుటకు సాగిరి మార్గ మధ్యమునందు వారు వివిధములగు మ్లేచ్ఛాది దేశములను, అనేక సముద్రలను, పెక్కు పర్వతపాదములను వివిధ మృగాకీర్ణములగు మనోహర వనములను కన్నుల పండువుగా చూచుచు కైలాస పర్వతమును సమీపించిరి, దాని సమీపమునందు నరనారాయణాశ్రమమును చూచిరి. అనేక ఫలపుష్ప వృక్షశోభితమగు బదరికాశ్రమమును దర్శించిరి. అచ్చట దట్టముగా మంచినీడ, చిగురు టాకులు, దీర్ఘశాఖలు, స్వాదు ఫలములు, నానా పక్షికులములు, పెక్కు ఊడలు, వేళ్లు గలిగి శోభిల్లుచున్న బదరీవృక్షమును చూచిరి అనేకముని సంఘములు దాని నాశ్రయించి యుండిరి

ఆవృక్షము వద్ద అందరును రాక్షసుల మూపులనుండి దిగిరి నరనారాయణుల బదరికాశ్రమమును దర్శించిరి. ఆ యాశ్రమము నందు చీకట్లుగాని, సూర్యకిరణములుగాని, క్షుత్పిపాసలుగాని, తోష్ణములుగాని లేకుండెను. అది సమస్త దుఃఖ నాశకముగా నుండెను. అది బ్రహ్మ తేజస్సుతో తేజరిల్లుచు ధర్మ బాహ్యులకు ప్రవేశయోగ్యముగాకుండెను. అంతటను బలిహోమములు, సుగంధి పుష్పోపహారములు. అగ్నిహోత్రశమములు గలిగియుండెను. సర్వ భూతములకు శరణ్యమై, సర్వదా వేదఘోషములలో ప్రతిధ్వనించుచు, అందరకు ఆశ్రయయోగ్యముగా నుండి శ్రమసంతతిని పోగొట్టునదిగా నుండెను.

అచట బ్రహ్మవాదులగు మునులు, నియతేంద్రియులై తపశ్చర్య చేయుచుండిరి అట్టి మహర్షులవద్దకు యుధిష్ఠరుడు తమ్ములతోపోయెను. ఆ ఋషులు దివ్యజ్ఞానముతో నీ ధర్మాత్ములను కనుగొని వీరినెదుర్కొని ఆదరించి యాశీర్వదించి అతిథి సత్కారములను చేసిరి. వారి సత్కారములను స్వీకరించి పాండవులు ఆపుణ్యాశ్రమము నందు ఋషులతో ప్రవేశించిరి. అచట భాగీరథీ తీరమందలి నరనారాయణాశ్రమును దర్శించి మైనాక పర్వతమును బిందు సరస్సును దర్శించి ఆ మనోహర వనము నందు విహరించుచుండిరి. అచటి విచిత్ర పుష్పఫల వనములను వాని శోభను తిలకించుచు ఆనందించుచుండిరి. అచటనే అర్జునుని చూచు కాంక్షతో వారు ఆరు రాత్రులు నివసించిరి.

( సశేషము )

"ఆంధ్రప్రదేశ్" పత్రికలో ప్రకటనలు యిచ్చి
మీ వ్యాపారాన్ని వృద్ధి పరచుకోండి

# జిల్లాల్లో

## పశు చికిత్సా కేంద్రానికి ప్రారంభోత్సవం

ఎమ్మిగనూరు నుంచి నందవరానికి పశుగణాభివృద్ధి విస్తరణ కార్యాలయాన్ని మార్చిన సందర్భంగా నందవరం గ్రామంలో జనవరి 8న బహిరంగ సభ జరిగింది. ఎమ్మిగనూరు పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ ఎం. రామన్న యీ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ కేంద్రం ఏర్పాటు చేయడానికి యీ గ్రామ ప్రజలు అద్దె లేకుండా ఉచితంగా వుండేందుకు భవన సౌకర్యాన్ని కల్పించారు. మందులను నిలవ చేయడానికి ఒక రెఫ్రిజిరేటరును విద్యా వర్ధక సంఘం వారు బహూకరించారు. ఈ కేంద్రం ప్రారంభోత్సవానికి జిల్లా పశు గణాభివృద్ధి అధికారి అధ్యక్షత వహించారు.

## ఏలూరులో ఎగ్జిబిషన్



పశ్చిమ గోదావరి జిల్లా గణపవరం పంచాయతీ సమితి ఏర్పాటు చేసిన వ్యవసాయ, పారిశ్రామిక, సాంస్కృతిక ప్రదర్శన–పశు ప్రదర్శనకు జనవరి 3వ తేదీన జిల్లా కలెక్టరు శ్రీ కె. ఉమాపతి ప్రారంభోత్సవం చేశారు.

పశ్చిమ గోదావరిలోని గణపవరం పంచాయతీ సమితి మూడు రోజుల పాటు వ్యవసాయ, పారిశ్రామిక, సాంస్కృతిక విషయాలను తెలియజేసే ఎగ్జిబిషన్‌ను ఏర్పాటు చేసింది. ఇందులో పశు ప్రదర్శన కూడా జరిగింది మూడు రోజులపాటు జరిగిన యీ ప్రదర్శన జనవరి 5వ తేదీతో ముగిసింది. ఇటువంటి ప్రదర్శనను ముందు ముందు పెద్ద ఎత్తున ఏర్పాటు చేయడంలో సహకరించవలసిందిగా సమితి అధ్యక్షులు శ్రీ జె. వెంకట రామయ్య ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

## అభివృద్ధి కార్యక్రమాలు

సమాచార, పౌరసంబంధ మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు జనవరి 7న పి. డబ్ల్యు. డి., రెవెన్యూ అధికారులతో కలిసి హుజూర్ నగర్ తాలూకాలో పర్యటించి మట్టంపల్లి, రఘునాథపాలెం, చింతిర్యాల, తమ్మవరం గ్రామాలను సందర్శించారు. గ్రామస్తుల సమస్యలను గురించి, నాగర్జునసాగర్ క్రింద ఆయకట్టు అభివృద్ధి గురించి మంత్రి తెలుసుకున్నారు. ప్రజలు సమైక్యతతో మెలిగి సమిష్టిగా తమ సమస్యలను పరిష్కరించుకోవాలని ఆయన పేర్కొన్నారు. తరచుగా గ్రామ సభ సమావేశాలను ఏర్పాటుచేసి అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రజలకు తెలియ చేయవలసిందిగా బ్లాకు అభివృద్ధి అధికారులకు ఆయన సూచించారు

## నీటి సదుపాయానికి హామీ

రేపల్లె, తెనాలి, బాపట్ల తాలూకాలలో వరి రెండో పంట 70,400 ఎకరాలకు నీటి సదుపాయాన్ని కల్పించడం జరుగుతుందని గుంటూరు జిల్లా కలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నం జనవరి 4న తెలియజేశారు. గట్లకు గండిపెట్టి పొలాలను తడుపుకొనే రైతులకు పెద్ద మొత్తం జుల్మానా విధించబడుతుందని ఆయన హెచ్చరించారు. కమ్మమూరు కాలవకు కొల్లి మెర్లలాకు దిగువనుంచి–వాటి పిల్ల కాలువలతో సహా–మరమ్మతు పనులు జరిపించే నిమిత్తం జనవరి 10 నుంచి మూసివేయడం జరుగుతుందని తెలియజేశారు.

## నల్గొండలో స్టేడియం ఆవశ్యకత



గృహనిర్మాణ శాఖామాత్యులు శ్రీ సి. రాజనరసింహ, డిప్యూటీ యిన్స్పెక్టర్ ... శ్రీ గోపాలకృష్ణ ఎరడీ అండ్ పార్టీ వారు టగ్ ఆఫ్ వార్ గెలిచిన సందర్భంగా బహుమతి ప్రదానం చేశారు.

(జనవరి 6వ తేది నల్గొండలో 11వ జిల్లా క్రీడోత్సవాల్లో)

సమాచార, పౌర సంబంధశాఖ మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు జనవరి 6న నల్గొండలో జిల్లా క్రీడోత్సవాలకు



జనవరి 20వ తేదీన శ్రీమతి ఇందిరా గాంధీ విశాఖపట్టణంలో ఉక్కు ఫ్యాక్టరీ పనికి ప్రారంభోత్సవం చేసిన సందర్భంగా హాజరైన పత్రికా ప్రతినిధులు

ప్రారంభోత్సవం చేస్తూ యువకులు మానసిక, శరీరక దార్ఢ్యాన్ని కలిగివుండాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు. నల్గొండలో ఒక స్టేడియం వుండాల్సిన అవసరాన్ని మంత్రి పేర్కొన్నారు. ఇందుకు అవసరమయ్యే నిధిని సేకరించడానికి చలన చిత్ర కళాకారులతో కూడిన ఉత్సవాన్ని ఏర్పాటు చేయడంలో తాను సహకరించ గలనని మంత్రి తెలియజేశారు. మొదట్లో, పోలీసు సూపరింటెండెంట్ శ్రీ భాస్కరరావు, మంత్రికి స్వాగతం పలికారు.



"ఆంధ్రశ్రీ"గా నిర్ణయింపబడిన శ్రీ కె. అప్పారావు (కృష్ణాజిల్లా) కు డిశెంబరు 13న కర్నూలులో, సమాచార, పౌరసంబంధ శాఖామాత్యులు శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారు బహుమతి ప్రదానం చేశారు

## బాలికల ఎన్.సి.సి. శిబిరం

బాలికల ఎన్.సి.సి. వార్షిక శిబిరం (జూనియర్ డివిజన్) డిశెంబరు 34న మదనపల్లిలో ముగిసింది. నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లోని పాఠశాలల కేడెట్లు సమర్పించిన మార్చ్‌పాస్ట్‌లో శాసన సభ్యులు శ్రీ ఎ. నరసింగరావు వందన స్వీకారంచేశారు. తమ ప్రసంగోపన్యాసంలో శ్రీ నరసింగరావు, ఎన్.సి.సి. బాలికల కేడెట్లను అభినందించారు. క్రమ శిక్షణతో కూడిన జీవితాన్ని గడపడానికి యిది తోడ్పడగలదని ఆయన అన్నారు

## కరువుసహాయక చర్యలకై అభ్యర్థన

ఒంగోలు జిల్లా కలెక్టరు శ్రీ పి. కె. దొరైస్వామి వెలిగండ్ల పంచాయతీ సమితిలోని జనవరి తొలివారంలో వర్షాలు పడక పోవడంవల్ల పంటలకు కలిగిన నష్టాన్ని అంచనా వేసే నిమిత్తం 35 గ్రామాలను సందర్శించారు. చాలా గ్రామాలలో ప్రజలు కరువు సహాయక కార్యక్రమాను చేపట్టవలసినదిగా, భూమి శిసును రద్దు చేయవలసిందిగా కలెక్టరుకు వినతి పత్రాలను సమర్పించారు.



ప్రొద్దుటూరులో పోలీసులు స్వాధీనం చేసుకున్న డైనమైట్లు, డిటొనేటర్లు, ఫ్యూజు తీగెలు వగైరా విధ్వంసక సామగ్రి.

## హరిజనుల ఆలయ ప్రవేశం

విశాఖజిల్లా నర్సీపట్నం పంచాయతీ సమితిలోని నిండుగొండ గ్రామంలో గల శ్రీ సీతారామాలయంలో చిరకాలంగా ఆలయ ప్రవేశానికి నోచుకోని హరిజనులకు హరిజన దినోత్సవం సందర్భంగా సమితి వైస్ ప్రసిడెంటు శ్రీ ఎస్ పోతురాజు నాయకత్వాన 1970 డిశంబరు 30న ఆలయ ప్రవేశం లభించింది. హరిజనులకు తీర్థాన్ని, ప్రసాదాన్ని పూజారి యిచ్చారు. ఈ సందర్భంలో శ్రీ పోతురాజు అధ్యక్షతన ఒక బహిరంగసభ కూడ జరిగింది.

హరిజనుల సంక్షేమానికి ప్రభుత్వం అమలు పరుస్తున్న వివిధ కార్యక్రమాలను గురించి బ్లాకు సహాయక పౌరసంబంధాధికారి శ్రీ ఎం. మధుసూధనరావు గ్రామస్థులకు వివరించారు. ఇళ్ళు కట్టుకొనేందుకు ప్రభుత్వం హరిజనులకు యిళ్ళ స్థలాలను మంజూరుచేస్తున్నదని ఉద్యోగాల కల్పనలో ప్రత్యేక సౌకర్యాలను అందిస్తున్నదని, ఉచిత విద్యాసౌకర్యాల్ని కల్పిస్తున్నదని తెలియజేశారు. కొందరు బీద హరిజనులకు శ్రీ పోతురాజు వస్త్రాలను పంపిణీ చేశారు. వి. ఎల్. డబ్ల్యు. శ్రీ అబ్దుల్ రజాక్ వందన సమర్పణ చేశారు.



గుంటూరుజిల్లా పెదనందిపాడు కళాశాలకు రివిన్యూ శాఖామాత్యులు శ్రీ పి. తిమ్మారెడ్డి డిశెంబరు 30వ తేదీన శంఖుస్థాపన చేశారు.

## గ్రామీణ రేడియో గోష్ఠికి ప్రారంభోత్సవం

ఖమ్మంజిల్లా సూదిమళ్ళ గిరిజన పంచాయతీ సమితికి చెందిన గోపాలపురంలో డిసెంబరు 29 న బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ మహమ్మద్ మోయుద్దీన్ గ్రామీణ రేడియోగోష్ఠికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ గోష్ఠిని వారం వారం జరిపించవలసిందిగా ఆయన గోష్ఠిసభ్యులకు విజ్ఞప్తి చేశారు. మేలురకం ఆధునిక పద్ధతుల్లో సాగుచేయడానికి ఈ సమాచారం తోడ్పడతుందనీ, పీటి ఫలితాలను రైతులు పొందడానికి ప్రయత్నించాలనీ అన్నారు.



ఖమ్మంలోని శ్రీమతి కత్తుల వీరమ్మ మెమోరియల్ ఉన్నత పాఠశాల వార్షికోత్సవాల సందర్భంగా విద్యార్థినులు ప్రదర్శించిన లంబాడీ నృత్యం.

## సహకార ధాన్యంమిల్లు

వరంగల్లు జిల్లా, నరసంపేట పంచాయితీ సమితిలోని చెన్నరావుపేటలో సహకార ధాన్యంమిల్లుకు డిశంబరు 27 న హోం శాఖ ప్రత్యేక కార్యదర్శి శ్రీ ఇ. వి. రామిరెడ్డి ప్రారంభోత్సవంచేశారు. జిల్లాకలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ అధ్యక్షత వహించారు.

ప్రభుత్వం 150 మిల్లులను మంజూరు చేయగా వాటిలో బహుకొద్ది మాత్రమే సంతృప్తికరంగా పనిచేస్తున్నాయని శ్రీ రామిరెడ్డి పేర్కొన్నారు.

తీవతర ఎరువుల పథకం క్రింద ప్రభుత్వం రూ. 9,90,000లు మంజూరు చేసినప్పటికీ మొత్తం 14 బ్లాకుల్లోనూ రెండు బ్లాకులు మాత్రమే ఋణాలు పొంద గలిగాయనీ, మిగతావి ఋణాల బకాయిలను చెల్లించకపోవడంవల్ల అవి పొందలేకపోయాయనీ కలెక్టరు తెలియజేశారు.

ధాన్యంమిల్లు ఏర్పాటుకు ప్రభుత్వం రూ. 1,55,000 లు మంజూరు చేసిందని సహకార గ్రామీణ పరతి సంఘం అధ్యక్షుడు శ్రీ ఎ. వెంకటేశ్వరరావు తెలియజేశారు.

## పెదనందిపాడులో కళాశాల

రాష్ట్ర రెవెన్యూమంత్రి శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి డిశంబరు 30 న పెద్దనందిపాడులో కళాశాలకు శంకుస్థాపన చేస్తూ సాంఘిక జీవితంలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకురావడంలో ఉపాధ్యాయులు కృషి చేయాలని అన్నారు. కళాశాలభవనానికి రూ. 25 వేలు విరాళమిచ్చిన ఏలూరు కాపురస్తులు శ్రీ కె. వీరయ్య, శ్రీనాగేంద్రగార్లను ఆయన అభినందించారు. ఈ కార్యక్రమానికి వాణిజ్యమంత్రి శ్రీ అంకినీడు ప్రసాద్ అధ్యక్షత వహించారు. వచ్చే యేడాది నాగార్జున సాగర్ జలాలు లభించడంతో పెదనందిపాడుకు చక్కటి భవిష్యత్తు వుండగలదని మంత్రి పేర్కొన్నారు.

## ట్యూబెక్టమీ శస్త్ర చికిత్సల్లో లక్ష్య సాధన

ఇబ్రహీంపట్టణం, రావిరాల శిబిరాలలో యిటీవల తక్కువ వ్యవధిలో 705 ట్యూబెక్టమీ శస్త్ర చికిత్సలు జరిగాయి. ఈ శిబిరాలలో మొత్తం 500 ట్యూబెక్టమీ శస్త్ర చికిత్సను జరిపించాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. ఈ లక్ష్యాన్ని అతి తేలికగా అధిగమించడం జరిగింది. ఈ శిబిరాల విజయానికి పోలీసు పటేలు శ్రీ లక్ష్మినర్సయ్య, పంచాయతీ సభ్యుడు శ్రీ పాండురంగారెడ్డి ఎంతో తోడ్పడ్డారు.



ఖమ్మంలో కత్తుల వీరమ్మ మెమోరియల్ ఉన్నత పాఠశాల వార్షికోత్సవం సందర్భంగా యిన్‌ఛార్జి కలెక్టరు శ్రీ కె.వి. యన్. గౌడ్ ప్రారంభోపన్యాసం చేశారు.

## పొదుపు ప్రచార కార్యక్రమం

చిత్తూరు జిల్లా సమాచార, పౌరసంబంధ శాఖ మదనపల్లిలో డిశంబరు 24న జాతీయపొదుపుకు సంబంధించిన ప్రచారోద్యమాన్ని ప్రారంభించింది. దీనికి బీసెంట్ థియోసాఫికల్ కాలేజి ప్రిన్సిపాలు శ్రీ డి. కోదండపాణి అధ్యక్షత వహించారు. ఇంగ్లీషు తెలుగు భాషల్లో వ్యాసరచనా పోటీ, ఏకపాత్రాభినయం పోటీలు వక్తృత్వ పోటీలు జరిగాయి. గెలిచిన వారికి బహుమతులను పంపిణీచేశారు.

## హరిజన కాలనీకి శంకుస్థాపన

సాంఘిక సంక్షేమ మంత్రి శ్రీ డి పెరుమాళ్ళు డిశంబరు 25న విశాఖజిల్లా గిడుతూరు గ్రామంలో హరిజన కాలనీకి శంకుస్థాపన చేశారు. జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ రాజా సాగి సీతారామరాజు అధ్యక్షత వహించారు. ప్రభుత్వం 8.60 ఎకరాల భూమిని సేకరించి 96 హరిజన కుటుంబాలకు పంపిణీ చేసింది ఇళ్ళు కట్టుకోడానికి కుటుంబం ఒక్కింటికి 400 రూ. లు కూడా ప్రభుత్వం మంజూరు చేసింది. హరిజనుల జీవనస్థాయిని మెరుగుపరచడానికి వారికి విద్య, గృహవసతి తదితర సౌకర్యాలను కల్పించడానికి ప్రభుత్వం చేపట్టుతున్న సంక్షేమ పథకాలను గురించి మంత్రి ప్రజలకు వివరించారు.

## పాఠశాలల అవసరాలపై సదస్సు

అంతర్జాతీయ విద్యాసంవత్సరం సందర్భంగా వాయల్పాడులోని బ్లాకుసమాచారకేంద్రంలో సమితిస్థాయి సదస్సుఒకటి డిశంబరు 30న జరిగింది. సమితి అధ్యక్షులు శ్రీ. వి. శ్రీనివాసరెడ్డి అధ్యక్షత వహించారు. ఈసదస్సులో ఉన్నత పాఠశాల హెడ్‌మాస్టర్లు, ప్రాథమిక పాఠశాలల హెడ్‌మాస్టర్లు, ఏకోపాధ్యాయ పాఠశాలల టీచర్లు, విద్యావిషయక స్థాయీసంఘం సభ్యులు పాల్గొన్నారు. ప్రాథమిక పాఠశాల స్థాయిలో విద్యాప్రమాణాలను అభివృద్ధి పరచడానికి చేపట్టవలసిన వివిధచర్యలను గూర్చి బ్లాకు అభివృద్ధి అధికారి సూచించారు. జిల్లా విద్యాధికారి శ్రీ ఏ. వి. ఎస్. సూర్యనారాయణమూర్తి సభికులకు స్వాగతం పలికారు.



హిందుస్థాన్ నౌకా నిర్మాణశాలలో నిర్మింపబడిన పాసింజర్ మోటారు లాంచి డిశెంబరు 31వ తేదీన యజమానులకు అందించబడింది.

# పుష్కలమైన పంటలకు ఫాక్టమ్‌ఫాస్

అన్ని రకముల భూములకు, పైర్లకు, అనుకూలమై తన ఆధిక్యతను నిరూపించుకున్న, అద్భుత సంకీర్ణ ఎరువు దక్షిణ ప్రాంత రాష్ట్రముల రైతులు విరివిగా వాడు ఎరువు. భారత దేశంలో రసాయన ఎరువుల ఉత్పత్తికే పునాది వేసిన బ్రహ్మాండమైన ప్రప్రథమ ఫాక్ట్ ఎరువుల ఫాక్టరీ ప్రతిష్ఠను చాటే ఎరువు

వరి పైరుకు శిఫారసు చేయబడ్డ ఎరువుల మోతాదులు ఎకరాకు కిలోగ్రాములలో

| | ఫాక్టమ్‌ఫాస్ 16 20 | మ్యూరియేట్ ఆఫ్ పొటాష్ | యూరియా |
|---|---|---|---|
| వరి : | | | |
| (ఎ) అధిక దిగుబడినిచ్చే రకాలు | 180 | 50 | 58 |
| (బి) దేశవాళీ రకాలు | 135 | 26 | 12 |




ఫాక్ట్ కర్షక బంధు

## ది ఫర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ ట్రావెన్‌కూర్ లిమిటెడ్, ఉద్యోగమండల్ - కేరళ

ఆంధ్రప్రదేశ్ ఏరియా ఆఫీసు షాపూర్‌వాడి, హైద్రాబాద్ - 4

ప్రాంతీయ కార్యాలయాలు - నిజామాబాద్ వరంగల్ కర్నూలు నెల్లూరు

aries EKM FT 152 TL

**Statement About Ownership And Other Particulars About**

**"ANDHRA PRADESH"**

FORM-IV

(*See Rule* 8)

| | |
|---|---|
| Place of Publication | : Hyderabad. |
| Periodicity of Publication | : Monthly. |
| Printer's Name | : Director, Government Printing. |
| Nationality | : Indian. |
| Address | : Chanchalguda, Hyderabad-24. |
| Publisher's Name | : P. Vaman Rao. |
| Nationality | : Indian. |
| Address | : Director, Department of Information, Public Relations and Tourism, Hyderabad, A.P. |
| (Chief) Editor's Name | : P. Vaman Rao. |
| Nationality | : Indian. |
| Address | : Director, Department of Information, Public Relations and Tourism, Hyderabad, A.P. |
| Name and address of individuals who own the Newspaper and partners or share-holders holding more than one per cent of the total capital. | Nil. |

I, P. Vaman Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) P. VAMAN RAO,

*Signature of the Publisher.*

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH AT THE GOVERNMENT CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION PUBLICRELATIONS AND TOURISM ANDHRA PRADESH, HYDERABAD

